శ్రీమతే రామానుజాయ నమః

శ్రీమద్వరవరమునయే నమః







# సాంప్రదాయిక వ్యాస మాలిక- 23

22-12-2023



నంబెరుమాళ్, శ్రీరంగం



'పండితరత్న'

డా|| ఉ. వే. శ్రీమాన్ ఈయుణ్ణి అభ్రిగ శింగరాచార్యులు

సమర్పణ: వంగల వేంకట కేశవ అయ్యంగారు

వేంకట కేశవ అయ్యంగారు

## విషయ సూచిక

# ఆళ్వారుల దివ్యప్రబంధాలు– శ్రీపాంచరాత్రశాస్త్రమ్.

భగవచ్ఛాస్త్రం అనే పేరు కలిగిన పాంచరాత్రంలో తెలుపబడిన అర్థాలను అళ్వార్లు తమ దివ్యప్రబంధాలలో ఎక్కడెక్కడ ఏ ఏ విధంగా ప్రస్తుతించారో, ఆ విషయాన్ని స్థాలీపులాకంగా అక్కడక్కడ ప్రస్తావించే ప్రయత్నం ఇది.

ముందుగా, ముదలాయిరంలోని మొదటి ప్రబంధాలైన తిరుప్పల్లాండు, పెరియాళ్ వార్ తిరుమొళి దివ్యప్రబంధాలలో గమనిద్దాం.

1. శ్రీపాంచరాత్రం పంచసంస్కార ప్రక్రియనుగూర్చి పేర్కొన్నది. ఈశ్వర సంహిత 21 వ అధ్యాయంలోని 284వ శ్లోకంలో –

"తాపః పుండ్రః తథా నామ మంత్రో యాగశ్చ పంచమః"

అని అంటూ తాప సంస్కారం, పుండ్ర సంస్కారం, నామసంస్కారం, మంత్ర సంస్కారం, యాగ సంస్కారం అనే ఐదు విధాలైన సంస్కారాలను గూర్చి పేర్కొన్నది.

తాపసంస్కారం అంటే –రెండు భుజాలపై శంఖచక్రలాంఛనాలను పొందడం.

పెరియాళ్వారులు తిరుప్పల్లాండు దివ్యప్రబంధంలో–

"తీయిల్ పొలిగిన్ఱ శెంజుడరాళి తికళ్ తిరుచ్చక్కరత్తిన్,
కోయిల్ పొఱియాలే ఒற்றுణ్డు నిన్ఱు కుడి కుడి ఆట్చెయ్ కిన్ఱోమ్"

(సూర్యుని కంటే,అగ్ని కంటే ఎక్కువగా ప్రకాశించే ఎర్రని జ్వాలావలయాలతో ప్రకాశించే సుదర్శనుని లాంఛనాలను పొందినవారమై, నీకు దాసులమై, తరతరాలుగా నీకు సేవ చేస్తున్నాము) అని,పెరియాళ్వార్ తిరుమొళి చివరి దశకంలో "ఎన్నైయుమ్ ఎన్నుడమైయైయుమ్ ఉన్ శక్కర ప్పొఱి

ఒற்றிక్కొండు నిన్నరుళే పురిందిరుందేన్" (నన్ను, నాకు సంబంధించిన వస్తువులను నీ సుదర్శన చక్ర లాంఛనంతో ముద్రించుకొని, నీ కృపపైననే ఆధారపడి ఉన్నాను) అనే సూక్తుల ద్వారా ఈ తాపసంస్కారాన్ని తెలియజేశారు.

2) పుండ్రసంస్కారం– శరీరంలో 12 స్థానాలలో 12 భగవన్నామాలతో ప్రతిష్ఠితమైన ఊర్ధ్వపుండ్రాలను ధరించడం.

దీనిని పెరియాழ்వారులు తమ ప్రబంధంలోని రెండవ శతకంలో గల మూడవ దశకంలో యశోదాభావనతో శ్రీకృష్ణుని కర్ణవేధసంస్కార కోసం పిలిచే క్రమంలో సూచించారు. "కేశవా! వారాయ్, నారాయణా! వారాయ్, మాధవా! వారాయ్!–– దామోదరా! వారాయ్" అని అంటూ 12 పుండ్రాలను ధరించేటప్పుడు ఏ పన్నెండు భగవానుని నామాలను మనం ఉచ్చరిస్తామో, ఆ 12 నామాలనే, కేశవ నామం మొదలుకొని దామోదర నామంవరకు అనుసంధించారు. ఇది పుండ్రసంస్కారానికి సూచకం.

3) మూడవది నామ సంస్కారం. అంటే, దాస్య నామాన్ని ధరించడం. "భగవంతునకు మనం దాసులం" అని, "ఆచార్యునకు మనం దాసులం" అని తెలియజేసే విధంగా ఆ భగవంతుని, ఆచార్యుల నామాలను మనం పెట్టుకోవడం. "రామానుజదాసన్" అని కదా మనకు పంచసంస్కార సమయంలో మన ఆచార్యులు నామనిర్దేశాన్ని చేస్తారు. అందువల్ల, నామసంస్కారం అంటే, భగవద్భాగవతాచార్య సంబంధాన్ని సూచించే నామాన్ని పెట్టుకోవడం.

పెరియాళ్వార్లు దీనిని తమ ప్రబంధంలో (4–6) దశకంలో

"కేశవన్ పేరిట్టు నీంగళ్ తేవి త్తిరుమినో, నాయగన్ నారణన్ తమ్మన్నై నరకమ్ పుగాళ్"

(కేశవుని నామాలను మీ సంతానానికి పెట్టి పిలుస్తూ ఆనందించండి ఆ విధంగా చేస్తే వారి తల్లి నరకానికి పోదు) అని,

"నంబి పింబి ఎన్ఱు నాట్టు మానిడ పేరిట్టాల్,

నంబుమ్ పింబుమ్ ఎల్లామ్ నాలు నాళ్ అழுజ్గిప్పోవ్మ్,

శెమ్ పెరు తామరైక్కణ్ణన్ పేరిట్టు అழைత్తక్కాల్,

నంబికాళ్! నారణన్ తమ్ అన్నై నరకమ్ పుగాళ్"

(నంబి, పింబి అను క్షుద్రమైన పేర్లను పెట్టినట్లయితే, ఆ గుణాలన్నీ నాలుగు దినాలలో నశిస్తాయి. పుండరీకాక్షుని నామాలను పెట్టి పిలిస్తే, నారాయణుని నామాన్ని ధరించిన ఆ బిడ్డల తల్లి నరకానికి పోదు) అనే మొదలైన సూక్తుల ద్వారా సూచించారు.

4) నాలుగవ సంస్కారం మంత్ర సంస్కారం. అంటే, మంత్రోపదేశాన్ని చేయడం.

దీనిని పెరియాళ్వారులు తిరుప్పల్లాండు ప్రబంధంలో

"నాడుమ్ నగరముమ్ నన్గఱియ నమో నారణాయ! వెన్ఱు పాడు మనముడై పత్తరుళ్ళీర్! వందు పల్లాండు కూఱుమినే"

(పల్లెలలో, పట్టణాలలో అంతటా చక్కగా తెలిసేటట్టుగా "నమో నారాయణాయ "అనే మంత్రాన్ని అనుసంధించే మనస్సు కలిగిన భక్తులారా! మీరందరూ వచ్చి భగవంతునికి మంగళాశాసనం చేయండి) అనే సూక్తి ద్వారా సూచించారు.

ఇక్కడ, ఈ పాశురంలో, పెరియాళ్వార్లు కైవల్యార్థులను ఆహ్వానిస్తున్నారు. మీరందరూ ఆత్మానుభవమే చాలు– అని అంతటితో తృప్తి పడుతున్నారు. దానికి తగినట్లుగా ఓంకారాన్ని, అంటే, ప్రణవాన్ని మాత్రం ఉచ్చరిస్తూ ఉన్నారు. ప్రణవం

జీవాత్మస్వరూపాన్ని నిర్దేశిస్తుంది. మీరు ప్రణవంతో మాత్రమే నిలువకుండా " నమో నారాయణాయ" అని చేర్చి, మంత్రానుసంధానం చేస్తే, "మనం భగవంతునకు మాత్రమే శేషం. ఆ స్వామికే కైంకర్యం చేయాలి. అదే ముఖ్యమైన మోక్షం" అని ఏర్పడుతుంది. ఓంకారాన్ని మాత్రం చెప్పి, కైవల్యంతో నిలువకండి. ప్రణవానికి "నమో నారాయణాయ" అని చేర్చి,అష్టాక్షరి మహా మంత్రాన్ని ఉచ్చరించండి, అనుసంధించండి. భగవల్లాభార్థులై, వైకుంఠానికి చేరాలని చూడండి" అని అంటూ మంత్రోపదేశాన్ని చేశారు.

5) ఇక, చివరిది, ఐదవది యాగం. ఇక్కడ యాగం అంటే, యజ్ఞయాగాదులు కాదు. భగవంతుని ఆరాధనే గొప్ప యాగం. "యజ– దేవపూజాయామ్" అని ధాతువు. ఇక్కడ దేవశబ్దానికి శ్రీమన్నారాయణుడు– అని అర్థం." శ్రద్ధయాఽ దేవో దేవత్వ మశ్నుతే (శ్రద్ధా అనే నామంతో చెప్పబడే లక్ష్మీదేవియొక్క సంబంధం చేతనే భగవానుడైన శ్రీమన్నారాయణుడు దేవత్వాన్ని పొందుతున్నాడు) అని వేదం కూడా చెప్పింది కదా. అందువల్ల, నిత్యం మనం చేసే తిరువారాధనయే యాగం.

ఈ యాగాన్ని పెరియాళ్వారులు తమ ప్రబంధంలో ఎక్కడ చెప్పారు ? అంటే,

"వెణ్ణెయ్ అళంద కుఱుంగుమ్ విళైయాడు పు**ழு**దియుమ్ కొండు,
తిణ్ణెన వెవ్విరా ఉన్నై తేయ్ త్తు క్కిడక్క నానొట్టేన్,
ఎణ్ణెయ్ పుళిప్ప**ழ**మ్ కొండు ఇంగెత్తనపోదు మిరుందేన్,
నణ్ణలరియ పిరానే! నారణా! నీరాడవారాయ్!" (2–4) (నీరాట్టమ్)

(ఎంత ప్రయత్నం చేసినా తెలుసుకోవడానికి సాధ్యం కాని స్వామీ! నారాయణా! నీ శరీరం, నిండుగా వెన్నను పూసుకున్న కారణంచేయ, మురిగిన వెన్న

వాసన కొడుతున్నది. దినమంతా ఆటలాడి ఒంటినిండా దుమ్ము పట్టించుకున్నావు. అలా ఉన్న శరీరంతో నిన్ను ఈ రాత్రికి నా పక్కన పడుకోవడానికి అంగీకరించను సుమా. నీకు జిడ్డు వదిలేలా నీళ్లు పోయడానికి నూనెను, సీకాయను చేతితో పట్టుకొని ఎంతసేపు నిలబడను? స్నానం చేయడం కోసం త్వరగా రా!) అని అంటూ యశోదాభావనతో పలికిన సూక్తిలో స్నానాసనాన్ని సమర్పించడాన్ని సూచించారు

ఆ విధంగానే,

"శెణ్బగ మల్లికైయోడు శెంగెழுనీర్ ఇరువాట్చి,
ఎణ్ పగర్ పూవుమ్ కొణర్ న్దేన్ ఇన్ఱు ఇవై శూట్ట వా వెన్ఱు"(2−7−10)

(సంపెంగ, మల్లె, ఎర్రకలువవంటి మంచి సువాసనలను వెదజల్లే అనేక పూలను తీసుకుని వచ్చి, శ్రీకృష్ణుని అలంకరించడం కోసం "కృష్ణా! రా!" అని అంటూ) పూలను సమర్పించడానికి సూచించారు.ఇవి మిగిలిన ఉపచారాలకు అన్నిటికీ ఒక లక్షణం. ఈ విధంగా యాగం అనే ఐదవ సంస్కారం సూచింపబడింది.

ఈ విధంగా, పెరియాళ్వారులు తమ సూక్తులలో పాంచరాత్ర సంహితా ప్రోక్తమైన పంచ సంస్కారాలను అనుసంధించారు.

2) వీరి ప్రియపుత్రిక గోదాదేవి తిరుప్పావై ప్రబంధంలో యాగమనబడే ఈ తిరువారాధన ప్రక్రియను పూర్తిగా అనుసంధించారు.

ప్రపన్నులు తిరువారాధనలో భగవానునకు ఆరు ఆసనాలను సమర్పిస్తారుకదా.

1) వాటిలో, మొదటి ఆసనం మంత్రాసనం. మనం చేసే తిరువారాధనను స్వీకరించమని భగవంతుని ఆహ్వానించి, సమర్పించే ఆసనం, ఇది. "మారి మలై ముழைఇల్" అనే 23వ పాశురంలో ఆహ్వానించి,

"కోప్పుడైయ శీరియ శింగాశనత్తిరుందు, నామ్ వంద కారియమ్ ఆరాయ్ న్దు అరుళ్" అని అనడం ద్వారా ఈ మంత్రాసనం సమర్పింపబడింది.

2) రెండవది స్నానాసనం. తిరుమంజనాన్ని సమర్పించడం. ఇది 26వ పాశురంలో తెలియజేయబడింది.

"మాలే! మణివణ్ణా! మార్గழి నీరాడువాన్, మేలైయార్ శెయ్ వనగళ్ వేండువన కేట్టియేల్"

(భక్తవ్యామోహాన్ని కలవాడా! మణివర్ణా! మార్గశీర్షవ్రతానుష్ఠానంకోసం కోసం పెద్దలు అపేక్షించే సామగ్రి ఏది? అని నీవు అడిగినట్లయితే) ఇత్యాదిగా ఈ ఆసనం సమర్పింపబడింది.

3) మూడవది అలంకారాసనం. ఈ ఆసనం తిరుప్పావైలో

"ఉందన్నై ప్పాడి ప్పఱై కొండు యామ్ పెఱు శమ్మానమ్, నాడు పుకழమ్ పరిశినాల్ నన్ఱాక, శూడగమే తోళ్ వళైయే తోడే శెవి ప్పూవే పాడగమే ఎన్ఱనైయ ప్పల్ కలనుమ్ యామణివోమ్ ఆడై ఉడుప్పోమ్" (27)

(నిన్ను కీర్తించి, నీవల్ల మేము పాప్యాన్ని పొంది పొందే సన్మానం ఏమంటే, లోకమంతా కీర్తించేటట్లుగా చక్కగా భుజకీర్తులను, వలయాలను, కర్ణాభరణాలను పాదకటకాలను,ఈ విధంగా ఉండే అనేక ఆభరణాలను మేము నీతో కలిసి అలంకరించుకుంటాము.వస్త్రాలను ధరిస్తాము) అనే పాశురంలో చెప్పబడింది.

నాల్గవ ఆసనం భోజ్యాసనం. ఇది అక్కడనే

"అదన్ పిన్నే పాల్ శోఱు మూడ నెయ్ పెయ్ దు ముழ்ழ்ఙ్గై వழிవార కూడి ఇరుందు, కుళిర్ ఎకళ్ పిన్ శెన్ఱు కానమ్ శేర్ న్దు ఉణ్బోమ్"

(ఆ తరువాత, పాయసాన్నం కనబడకుండా ఆవరించేటట్లుగా దానిలో నేతిని పోసి, ఆ ప్రసాదాన్ని అరచేతిలో పెట్టుకుంటే మోచేతి వరకు జారిపోయేటట్లుగా ఉండగా, దానిని ఓవుల వెంట అరణ్యాలకు వెళ్ళి, కలసి భుజిస్తాము) అనే సూక్తిలో సూచింపబడింది.

ఐదవది పునర్మంత్రాసనం. ఈ ఆసనంలోనే మనం భగవానునకు మంగళాశాసనం పాడుతూ, మనం చేయవలసిన విజ్ఞాపనను చేస్తాము. ఇది

"ఎற்றைక్కుమ్ ఏழேழ பిఱవిక్కుమ్ ఉందన్నోడు உற்றோமే యావోమ్, ఉనక్కే నామాట్చెయ్ వోమ్, మற்றை నమ్ కామంగళ్ మాற்று" (29)

(ఎప్పటికీ ఏడేడు జన్మలకు ఎంతో సంబంధాన్ని కలిగిన వారం కాగలము.నీకే మేము దాస్యాన్ని చేస్తాము.మిగిలిన మా కోరికలను అన్నిటినీ మాకు లేకుండా చేయి) అనే సూక్తిలో సూచించారు.

6) చివరిది పర్యంకాసనం. ఈ ఆసనంతో భగవదారాధన పూర్తి అవుతుంది. శయనించేటప్పుడు "మాధవా! మాధవా! అని మాధవ నామాన్ని ఉచ్చరించడం అలవాటు కదా. ఈ ఆసనం ఈ తిరుప్పావై ప్రబంధంలోని చివరి పాశురంలో "వంగ క్కడల్ కడైందామాధవనై క్కేశవనై" అనే మాధవ నామాన్ని ఉచ్చరించడం ద్వారా ఈ ఆసనం సూచింపబడింది.

ఈ విధంగా తిరుప్పావై ప్రబంధంలో గోదాదేవి భగవంతుని ఆరాధనలోని ఆరు ఆసనాలను ఆయా పాశురాలలో సూచించింది.

## ఆళ్వారుల దివ్యప్రబంధాలు– శ్రీపాంచరాత్రశాస్త్రమ్

భగవానుడు అయిదు విధాలైన ప్రకారాలను కలిగి ఉంటాడని పాంచరాత్ర శాస్త్రం చెబుతూ ఉన్నది. విష్వక్సేన సంహితలో భగవానుడే స్వయంగా "మమ ప్రకారాః పంచేతి ప్రాహుః వేదాంత పారగాః, పరో వ్యూహ శ్చ విభవో నియంతా సర్వదేహినామ్, అర్చావతార శ్చ తథా దయాళుః పురుషాకృతిః, ఇత్యేవం పంచధా ప్రాహుః మాం వేదాంతవిదో జనాః" (నా ప్రకారాలు ఐదు విధాలుగా ఉంటాయి– అని వేదాంతంలో తలస్పర్శి అయిన పాండిత్యం కలవారు చెబుతున్నారు. పరం, వ్యూహం, విభవం, అందరి హృదయాలలో నివసిస్తూ,వారిని నియమించే అంతర్యామి, ఆ విధంగానే, మిక్కిలి దయను కలిగిన పురుషరూపాన్ని కలిగిన అర్చావతారం– అని ఈ విధంగా ఐదు విధాలైన ప్రకారాలను నేను కలిగి ఉంటానని వారు చెబుతున్నారు) ఈ విషయాన్ని తెలియజేశాడు.

పర రూపం వైకుంఠంలోనూ, వ్యూహ రూపం క్షీరాబ్ధిలోను ఉంటుంది. విభవరూపాలు రామకృష్ణాది అవతార రూపాలు. అంతర్యామి అంటే, జీవుల హృదయ కోశాలలో ఎల్లప్పుడూ ఉంటూ, వారిని నియమించే రూపం. అర్చారూపం అనేది దేవాలయాలలో, మందిరాలలో, గృహాలలో శిలా లోహాది ఆకృతులలో వేంచేసి ఉండే రూపం.

ఈ ఐదు విధాలయిన ప్రకారాలను తిరుప్పావై ప్రబంధంలో గోదాదేవి మొదటి ఐదు పాశురాలలో సూచించినది– అని పెద్దల వ్యాఖ్యానం.

భగవంతుని పరరూపం తిరుప్పావై ప్రబంధంలోని మొదటి పాశురంలో " నారాయణనే నమక్కే పఱై తరువాన్" (శ్రీమన్నారాయణుడే మనకే ప్రాప్యాన్ని అనుగ్రహిస్తాడు) అనే సూక్తిలో సూచింపబడింది.

వ్యూహరూపం రెండవ పాశురంలోని "పాఱ్కడలుళ్ పైయిత్తుయిన్ఱ పరమన్" (పాలసముద్రంలో ఆదిశేషునిపై శయనించి ఉండే పరమాత్మ) అనే సూక్తి ద్వారా సూచింపబడింది.

మూడవది విభవరూపమైన అవతార రూపం. ఇది మూడవ పాశురంలో "ఓంగి ఉలగళంద ఉత్తమన్"(పెరిగి పెద్దవాడై, లోకాలను కొలిచిన ఉత్తముడు) అని అంటూ త్రివిక్రమావతారాన్ని సూచించడం ద్వారా తెలియజేయబడింది.

నాలుగవ రూపం అంతర్యామిరూపం. వరుణునకు అంతర్యామిగా ఉండే భగవంతుని రూపం " ఆழி మழை క్కణ్ణా! ఒన్ఱు నీ కైకరవేల్" (గంభీరమైన వర్షానికి నిర్వాహకుడవైన స్వామీ! నీవు కొంచెం కూడా సంకోచాన్ని చూపవద్దు) అనే తిరుప్పావైనాలుగవ పాశురంలోని సూక్తిలో సూచింపబడింది.

చివరిది అర్చావతారం. ఇది ఐదవ పాశురంలోని " మాయనై మన్ను వడ మదురై మైందనై" (ఆశ్చర్యకరమైన లీలలను చేసేవాడు, స్థిరమైన కీర్తిని కలిగిన, ఉత్తర భారతంలో ఉండే మధురానగరంలో ఉండే యువకుడు) అని ఉత్తరమధురా క్షేత్రంలో ఉండే అర్చారూపం కీర్తింపబడింది.

ఈ విధంగా పరత్వాది పంచక సూచన తిరుప్పావైలో గోచరిస్తున్నది.

3) ఇప్పుడు కులశేఖరాళ్వరుల పెరుమాళ్ తిరుమొళి ప్రబంధాన్ని గమనిద్దాం. అందులో పాంచరాత్ర ప్రోక్తమైన పంచకాల ప్రక్రియ సూచింపబడింది. దినంలోని కాలాన్ని ఐదు భాగాలుగా చేసి, ఈ ఐదు కాలాలలో ఐదు విధాలుగా భగవంతుని ఆరాధించే క్రమం ఇది.

వాటిలో మొదటి కాలం అభిగమనకాలం అని చెప్పబడుతున్నది ఈ సమయంలో స్నానం చేసి. సంధ్యావందనం, జపం మొదలైన వానిని నిర్వర్తించడం

జరుగుతుంది. రెండవది ఉపాదాన కాలం. భగవదారాధనకు ఆవశ్యకమైన పవిత్రమైన తీర్థం, చందనం, పూలు, ధూపం, దీపం, ఫలాలు, ప్రసాదం మొదలైన ద్రవ్యాలను భక్తి పూర్వకంగా సేకరించి పెట్టుకోవడం. మూడవది ఇజ్య. ఇది మాధ్యాహ్నికానికి తరువాత చేయబడేది. భగవంతునకు ఆరాధన చేసే కాలం, ఇది. నాల్గవది స్వాధ్యాయం. వేదాలు, ఇతిహాసాలు, పురాణాలు, అళ్వారుల దివ్య ప్రబంధాలు, పూర్వాచార్యుల స్తోత్రాలు మొదలైన వాటిని అధ్యయనం చేసి, వాటి అర్థాలను స్మరించడం. ఐదవది యోగం. ఇది సాయంసమయంలో సంధ్యావందనానంతరం చేయబడేది. భగవంతుని ధ్యానించి, ఆ స్వామి కళ్యాణ గుణానుభవాన్ని పొందడమే ఇది.

ఈ విధంగా ఈ ఐదు కాలాలలోనూ భగవంతుని సేవించే ప్రకారాలను పాంచరాత్ర శాస్త్రం వివరంగా తెలుపుతున్నది. ఈ క్రమాన్ని అనుసరించేవారికి పంచకాల పరాయణులు అని పేరు. వీరిని గూర్చి కులశేఖర ప్పెరుమాళ్ తమ ప్రబంధంలోని మొదటి దశకంలో 7వ పాశురంలో

"మఱమ్ తికழுమ్ మనమొழிత్తు వంజమాற்றி ఐమ్బులన్ కళడక్కి ఇడర్ పారత్తున్బమ్ తుఱందు, ఇరు ముప్పొழுదేత్తి "

(తీవ్రమైన కోపంతో జ్వలించే మనసును సవాసనగా పరిశుద్ధం చేసికొని, వంచన చేసే స్వభావాన్ని న లేకుండా చేసుకుని, క్రూరమైన ఐదు ఇంద్రియాలను లౌకికమైన విషయాలలో ఆసక్తం కాకుండా ఉండే రీతిలో నియంత్రించి, చాలా దుఃఖాన్ని కలిగించే ప్రాక్తనకర్మల పెను భారాన్ని తీర్చుకొని, అభిగమనాది ఐదు కాలాలలో భగవంతుని సేవించి, అనాది అయిన, ప్రాచీనమైన

పాంచరాత్రసంప్రదాయంలో స్థిరంగా నిలచి ఉండే భక్తులు) అనే సూక్తిలో ప్రస్తుతించారు.

4) ఇప్పుడు, తిరుమళిశైప్పిరాన్ సూక్తిలో పాంచరాత్రోక్తమైన ఒక అర్థాన్ని చూద్దాం.

వారు తిరుక్కుడంద్తై అనబడే కుంభకోణ క్షేత్రానికి వచ్చి అక్కడ ఉండే ఆరావముదాళ్వార్ అనే పేరు కలిగిన స్వామిని సేవించారు. అప్పుడు ఆ స్వామిని ప్రశ్నిస్తూ తిరుచ్చందవిరుత్తం ప్రబంధంలో(61) ఈ విధంగా అన్నారు.

"నడంద కాల్ గళ్ నొందవో? నడుంగ ఞాలమేనమాయ్,
ఇడంద మెయ్ కులుంగవో? విలంగుమాల్ వరైచ్చురమ్,
కడంద కాల్ పరంద కావిరి క్కరై క్కుడంద్తైయుళ్,
కిడందవాఱు ఎழுన్దిరుందు పేశు వాழி కేశనే!"

(నీరు పొంగకుండా అడ్డంగా ఉండే పెద్ద పెద్ద కొండలను మొదలైనవానిని వేగంగా దాటుకుంటూ వచ్చే విస్తారమైన ప్రవాహాలను కల కావేరీ నద తీరం పైన ఉండే కుంభకోణక్షేత్రంలో నీవు శయనించి ఉండే తీరు– లోకాలను కొలిచిన నీచరణాలకు నొప్పి పుట్టినందువల్లనా? భూదేవి భయపడినప్పుడు మహావరాహ రూపాన్ని ధరించి, భూమిని అండభిత్తినుండి పైకి లేవనెత్తిన నీ తిరుమేని శ్రమపడినందువల్లనా? కేశవా! నీవు లేచి నాకు సమాధానం చెప్పు. నీ శయన సౌభాగ్యానికి నిత్యమంగళం)

వీరు ఈ విధంగా అనగానే, అక్కడ ఉండే స్వామి తాను పడుకున్న సన్నివేశం నుండి పైకి లేవబోయాడు. "స్వామీ! నీ శయన సౌందర్యానికి ఏ భంగం కలుగకూడదు.నీవు ఆ విధంగానే ఉండు" అని ఆళ్వారులు అనగా, స్వామి ఆ

విధంగానే, ఆళ్వారుల మాటను మన్నిస్తూ ఉత్థానశాయి సన్నివేశంలో ఈనాటికి వేంచేసి ఉన్నాడు.

ఆళ్వార్లు ఈ విధంగా కుంభకోణంలోని స్వామిని మాత్రం లేచి సమాధానం చెప్పమని ఎందుకు అడిగారు? ఇక్కడ ఒక విశేషం ఉన్నది. ఈ క్షేత్రంలో భగవంతుని ఆరాధనా ప్రకారం పాంచరాత్రాగమానికి చెందిన శ్రీప్రశ్నసంహితను అనుసరించి చేయబడుతున్నది.

ఈ సంహితలో నాల్గవ అధ్యాయంలోని పన్నెండవ శ్లోకంలో భగవానుడు లక్ష్మీదేవిని ఉద్దేశించి పలుకుతూ, " ఒక మూర్తిలో నన్ను ఆవాహన చేసి, ఒక భక్తుడు నన్ను ఆరాధించినట్టయితే, ఆ మూర్తిని నీవు ఏదో ఒక నా రూపానికి ప్రతినిధిగా మాత్రం భావించవద్దు.

"అహం తద్బింబ మావిశ్య భక్తానా మిష్టసాధకః,
త్వయా సహ భవిష్యామి నాత్ర సందేహా అస్తు తే"

(భక్తుడు ఏ బింబంలో నన్ను ప్రతిష్ఠ చేసి ఆరాధిస్తాడో, నేను ఆ బింబంలో నీతో కలసి ఆవేశించి ఉండి, ఆ భక్తుని ఇష్టాలను అన్నిటినీ అనుగ్రహించేవాడనై ఉంటాను. ఈ విషయంలో నీకు ఏ సందేహం అక్కరలేదు) అని అన్నాడు.

దీనిని అనుసరించే ఆళ్వారులు ఇక్కడ ఉండే స్వామిని లేచి సమాధానం చెప్పమని ప్రార్థించారు. భగవంతుడు కూడా, తాను శ్రీప్రశ్న సంహితలో పలికిన మాటను వాస్తవం చేస్తూ, ఆళ్వారులు చెప్పినట్లుగానే చేశాడు.

5) ఇప్పుడు తొండరడిప్పొడి ఆళ్వారుల తిరుమాలై ప్రబంధంలోని ఒక పాశురంలో గోచరించే పాంచరాత్రశాస్త్రార్థాన్ని గమనిద్దాం.

పాంచరాత్రాగమానికి సంబంధించిన సాత్త్వత సంహితలో 16వ అధ్యాయంలో భగవదాశ్రయణవైభవం ఈ విధంగా తెలుపబడింది.

"దురాచారో ఽ పి సర్వాశీ కృతఘ్నో నాస్తికః పురా,
సమాశ్రయేదాదిదేవం శ్రద్ధయా శరణం యది
నిర్దోషం విద్ధి తజ్జంతుం ప్రభావాత్ పరమాత్మనః"

(ఇంతకుముందు చెడ్డ ప్రవర్తనను కలిగినవాడైనా, తినకూడని పదార్థాలను తినేవాడైనా, చేసిన మేలును మరిచేవాడైనా తరువాత అతడు ఆదిదేవుడైన శ్రీమన్నారాయణుని పశ్చాత్తాప పూర్వకంగా ఆశ్రయించినట్టయితే,ఆ వ్యక్తిని, భగవంతుని సంబంధం యొక్క ప్రభావం చేత దోషం లేనివానినిగానే తెలుసుకో.) అని తెలిపింది.

ఒకడు భగవంతుని ఆశ్రయించినట్లయితే, అతడు పూర్వం ఎన్నో దురాచారాలను చేసినవాడైనా, ఎంతటి తీవ్రమైన దోషాలను కలిగినవాడైనా, చివరికి కృతఘ్నుడైనా సరే, ఆ భగవంతుని సంబంధప్రభావంచేత అంతకు ముందు అతనిలో ఉండే దోషాలు అన్నీ లేకుండా పోతాయి. అతడు పరమపవిత్రుడు కాగలడు– అని పైసూక్తి తెలుపుతున్నది.

ఇదే అర్థాన్ని తిరుమాలై ప్రబంధంలో తొండరడి ప్పొడి ఆళ్వారులు ఈ క్రింది పాశురంలో అనుసంధించారు.

తిరుమఱుమార్బ! నిన్నై శిందైయుళ్ తికழ వైత్తు,
మరువియ మనత్తరాగిల్ మానిలత్తుయిర్ గళ్ ఎల్లామ్,
వెరువుఱ క్కొన్ఱు శుట్టిట్టు ఈట్టియ వినయరేలుమ్
అరువినై ప్పయనదుయ్యార్ అరంగమానగరుళానే!" (40)

(లక్ష్మీదేవిని, శ్రీవత్సం అనే పుట్టుమచ్చను వక్షఃస్థలంలో కలిగినవాడా ! భక్తులకు కోసం శ్రీరంగమహానగరంలో నిత్యవాసం చేసేవాడా! ఈ విశాలమైన భూమిలో ఉండే జీవరాసులన్నీ భయపడి జంకేటట్టుగా వారిని ఆయుధాలతో వధించి, అగ్నిలో దహించి, ఈ విధంగా సంపాదించిన తీవ్రమైన పాపాలను

కలిగినవారైనా, నిన్ను పశ్చాత్తాపంతో తమ మనసులో ఉపాయంగా ప్రకాశించేటట్లు నిలుపుకొని, నీవే ప్రాప్యం– అనే దృఢమైన నమ్మికను కలిగినవారైతే, వారు క్రూరమైన పాపాల ఫలాన్ని ఏ మాత్రం అనుభవించరు.)

ఈ పాశురంలో పైన ప్రస్తావించిన పాంచరాత్ర శాస్త్ర ప్రమాణంలోని అర్థం అనుసంధింపబడిన విషయం స్పష్టం కదా.

ఇవి, ముదలాయిరం అనే మొదటి సహస్రంలోని కొన్ని ఉదాహరణలు.

ఇప్పుడు పెరియ తిరుమొழி అనే రెండవ ఆయిరంలో ఒక ఉదాహరణను గమనిద్దాం.

ఈ ప్రబంధంలోని ఒక దశకంలో(1–9) శ్రీవేంకటేశ్వరుని సన్నిధిలో తిరుమంగై మన్నన్ శరణాగతి చేస్తున్నారు. ఈ శరణాగతిని వారు అహిర్బుధ్న్య సంహితావచన ప్రకారంగా చేయడం విశేషం.

ఆ సంహితలో మనం శరణాగతిని చేసే ప్రకారం ఈ విధంగా చెప్పబడింది.

"అహ మస్మ్యపరాధానా మాలయోఽ కించనో ఽగతిః,
త్వమేవోపాయభూతో మే భవేతి ప్రార్థనామతిః,
శరణాగతి రిత్యుక్తా సా దేవే ఽ స్మి న్ ప్రయుజ్యతామ్"

("నేను అపరాధాలకు ఆలయమై ఉన్నాను. నన్ను రక్షించుకునే పుణ్యం ఏదీ లేనివాడను. నీవు తప్ప ఇంకొక గతి ఏదీ లేనివాడను.నీవే నాకు ఉపాయం కావాలి" అనే ప్రార్థనాపూర్వకమైన అభిప్రాయమే శరణాగతి అని చెప్పబడినది. ఆ శరణాగతి ఈ లక్ష్మీసహితుడైన ఈ దేవుని విషయంలోనే ప్రయోగింపబడాలి).

ఇదే క్రమంలో తిరుమంగై మన్నన్ శ్రీవేంకటేశ్వరుని సన్నిధిలో ఈ క్రింది పాశురాన్ని అనుసంధిస్తూ శరణాగతి చేశారు.

మానేయ్ కణ్ మడవార్ మయక్కిల్ పట్టు, మానిలత్తు

నానే నానావిద నరకమ్ పుకుమ్ పావమ్ శెయ్ దేన్.

తేనేయ్ పూమ్ పొ**ழி**ల్ శూ**ழ்** తిరువేంగడమామలై, ఎన్
అనాయ్! వందడైందేన్, అడియేనై ఆట్కొండరుళే. (1–9–2)

(తేనె నిండుగా ఉండే, తుమ్మెదలు ధ్వనించే పూదోటలతో సమృద్ధిగా ఉండే వేంకటపర్వతంపై నిత్యవాసం చేసే, గజంవలె ఉండే ఓ స్వామీ! ఈ లోకంలో ఎన్నో సంవత్సరాలుగా లేడి కన్నులవంటి అందమైన కన్నులను కలిగిన స్త్రీల నేత్రాలు అనే వలలో చిక్కుకొని అనేక విధాలైన నరకాలను అనుభవించవలసిన పలు పాపాలను చేశాను. ఆ పాపాలను తలచి బాధపడిన నేను పశ్చాత్తాపంతో ఇప్పుడు నీ చరణాలను ఆశ్రయించాను. నన్ను నీ దాసునిగా స్వీకరించాలి).

ఇక్కడ "నానే నానావిద నరకమ్ పుకుమ్ పావమ్ శెయ్ దేన్." (నేనే అనేక విధాలయిన నరకాలకు పోయే పాపాలను చేశాను) అనే సూక్తి "అహ మస్మ్యపరాధానా మాలయః" అనే సూక్తిలోని అర్థాన్ని అనుసంధిస్తున్నది.

అప్పుడు ఏం చేయాలి?"త్వమేవోపాయభూతో మే భవేతి ప్రార్థనామతిః, శరణాగతి రిత్యుక్తా సా దేవే ఽ స్మి న్ ప్రయుజ్యతామ్" అని చెప్పినట్లుగా భగవంతుని పాదాలలో శరణాగతి చేయాలి కదా. ఆ విధంగానే, ఆళ్వార్లు "వందడైందేన్, అడియేనై ఆట్కొండరుళే" అని అంటూ శ్రీవేంకటేశ్వరుని శ్రీచరణాలలో శరణాగతి చేశారు.

ఇప్పుడు, ఇయఱ్పా అనే మూడవ ఆయిరంలో రెండు ఉదాహరణలను గమనిద్దాం.

ముదలాళ్వారులు తమ ప్రబంధాలలో చాలా అద్భుతంగా పాంచరాత్ర శాస్త్రార్థాలను అనుసంధించారు.

పాంచరాత్ర శాస్త్రానికి సంబంధించిన జితంతే స్తోత్రం

**"న తే రూపం న చాకారో నాయుధాని న చాస్పదమ్,**
**తథాపి పురుషాకారో భక్తానాం త్వం ప్రకాశసే"**

(భగవన్! నీ దివ్యాత్మ స్వరూప నీకోసం లేదు, నీ దివ్యమంగళ విగ్రహం నీ కోసం లేదు. నీ నివాసమైన వైకుంఠం నీ కోసం లేదు, నీ ఆయుధాలు నీకోసం లేవు. ఇవి అన్ని నీ భక్తుల కోసంగా ఉన్నాయి. అయినప్పటికీ, నీవు పురుషాకారాన్ని ధరించినవాడవై భక్తులకు సాక్షాత్కరిస్తున్నావు.) అని తెలిపింది. అందువల్ల భగవంతుడు తాను స్వీకరించే రూపం భక్తుల అభిమతానుసారంగా స్వీకరిస్తాడు. ఈ అర్థాన్నే సరోయోగి తన మొదటి అందాది ప్రబంధంలోని

**"తమరుగందదు ఎవ్వురువమ్ అవ్వురువమ్ తానే,**
**తమరుగందదు ఎప్పేర్ మత్త పేర్– తమరుగందు**
**ఎవ్వణ్ణమ్ శిందిత్తు ఇమైయాదిరుప్పరే**
**అవ్వణ్ణమ్ ఆழியానామ్."** (44)

(సుదర్శన చక్రాన్ని చేతిలో ధరించిన స్వామి తన భక్తులు ఏ రూపాన్ని ఇష్టపడతారో, ఆ రూపాన్ని తాను స్వీకరిస్తాడు. అంతేకాక, తన దాసులు ఏ నామాన్ని ఇష్టపడతారో, ఆ పేరును పొందుతాడు. తన దాసులు ఏ రీతిలో భావించి నిరంతరం తనను ధ్యానిస్తారో, అతడు ఆ ఆ విధంగా అవుతాడు.) అనే పాశురంలో అనుసంధించారు.

పాంచరాత్ర శాస్త్రానికి చెందిన లక్ష్మీ తంత్రం లక్ష్మీ వైభవాన్నిగూర్చి ఈ విధంగా తెలుపుతున్నది

**"లక్ష్మ్యా సహ హృషీకేశః దేవ్యా కారుణ్యరూపయా,**
**రక్షకః సర్వసిద్ధాంతే వేదాంతే ఽ పి చ గీయతే"**

(కరుణాస్వరూపిణి అయిన లక్ష్మీదేవితో కూడుకొని ఉండే నారాయణుడే రక్షకుడుగా అన్ని సిద్ధాంతాలలో, వేదాంతాలలోకూడా కీర్తింపబడుతున్నాడు)

అందువల్ల, "లక్ష్మిసహితుడైన నారాయణుడే రక్షకుడు" అనేది సర్వసిద్ధాంత సారం. ఇదే పాంచరాత్రశాస్త్ర ప్రతిపాదితమైన అర్థం.

దీనిని పేయాళ్వార్లు మూడవ తిరువందాది ప్రబంధంలో చివరి పాశురంలో

"శార్వు నమక్కెన్ఱుమ్ శక్కరత్తాన్, తణ్ తుழாయ్
తార్ వాழ் వర మార్బుమ్ తాన్ ముయంగుమ్– కారార్ న్ద
వానమరుమ్ ఇన్నిమైక్కుమ్ వణ్ తామరై నెడుమ్ కణ్
తేనమరుమ్ పూ మేల్ తిరు"(100)

(సుదర్శనచక్రాన్ని ధరించినవాడు, చల్లని తులసీమాలతో ప్రకాశించే పర్వతంవంటి వక్షస్సును కలవాడైన సర్వేశ్వరుడు సంశ్లేషిస్తున్న, మేఘంతో అమరి ఉండే మెరుపువలె ప్రకాశిస్తున్నది, సుందరమైన తామర పువ్వువలె విశాలమైన నేత్రాలను కలిగినది, తేనెతో నిండిన తామర పువ్వులలో నిత్యవాసం చేస్తున్నది అయిన శ్రీమహాలక్ష్మి యే మనకు ఎల్లప్పుడూ పురుషకార రూపిణిగా రక్షకురాలు అవుతున్నది) అని అనుసంధించారు. ఈ అర్థన్నే భక్తిసార మునీంద్రులు కూడా "తిరువిల్లా ద్దేవరై త్తేఱేల్మిన్ తేవు" (లక్ష్మీ సంబంధం లేని దైవాలను పరదైవంగా అశ్రయించకండి) అని నాన్ముగన్ తిరువందాది ప్రబంధంలో అన్నారు.

ఇక,చివరి సహస్రం అయిన తిరువాయ్ మొழி ప్రబంధంలో గమనిద్దాం.

నమ్మాళ్వారుల తిరువాయ్ మొழி ప్రబంధానికి దీర్ఘశరణాగతి అని పేరు. ఆ ప్రబంధంలో పలుచోట్ల వారు శరణాగతి తత్వాన్ని ప్రతిపాదించారు. కుంభకోణ దివ్యదేశంలో ఉండే ఆరావముదాழ்వార్ అనే అర్చామూర్తి సన్నిధిలో ఆళ్వార్లు, అహిర్బుధ్న్యసంహితలో శరణాగతి తెలుపబడిన రీతిలో శరణాగతి చేశారు. ఆ

సంహితలో ఎన్ని అంగాలు కలిగినదిగా శరణాగతి చెప్పబడిందో,అన్ని అంగాలతోనూ వారు శరణాగతి చేశారు. ఆ సంహితలో శరణాగతి–

"ఆనుకూల్యస్య సంకల్పః ప్రాతికూల్యస్య వర్జనమ్,
రక్షిష్యతీతి విశ్వాసః గోప్తృత్వవరణం తథా,
ఆత్మనిక్షేపకార్పణ్యే షడ్విధా శరణాగతిః"

1) భగవంతుడు చేసే రక్షణ ప్రయత్నానికి అనుకూలంగా తానుండాలని సంకల్పించడం, 2) ప్రతికూలంగా ప్రవర్తించడాన్ని విడచివేయడం, 3) "భగవంతుడు తప్పక రక్షిస్తాడు" అనే గొప్ప విశ్వాసాన్ని కలిగి ఉండడం, 4) భగవంతునే రక్షకునిగా వరించడం, 5) తన రక్షణభారాన్ని భగవంతుని సన్నిధిలో సమర్పించడం, 6) తనను రక్షించేది వేరు ఏదీ తన వద్ద లేదని నివేదించడం –అని ఈ విధంగా శరణాగతి ఆరు అంగాలను కలిగినది) అని ఆరు అంగాలను కలిగినదిగా చెప్పబడింది.

ఈ ఆరు అంగాలతోకూడి ఉండేటట్లుగా నమ్మాళ్వార్లు తమ శరణాగతిని ఆరావముదాழ்వార్ సన్నిధిలో చేశారు.

1) ఆనుకూల్యసంకల్పం, అంటే – ఎవరి విషయంలో శరణాగతి చేయబడుతున్నదో, అతని మనసుకు అనుకూలంగా ప్రవర్తించాలని సంకల్పించుకోవడం. శరణ్యుని మనస్సుకు అనుకూలంగా ప్రవర్తించడం. శరణ్యుని మనస్సుకు సంతోషం కలిగించకపోతే, అతడు రక్షించాడు కదా.

భగవంతునకు సంతోషం కలిగించే విషయం ఏది ?అని అంటే, ఆ స్వామి భక్తులను సేవిస్తే,అతనికి మిక్కిలి ప్రియంగా ఉంటుంది. అందువల్ల ఆళ్వారులు ఈ దశకంలో శరణాగతి చేసేటప్పుడు,

"వాழ் తొల్ పుకழாర్ కుడండై క్కిడందాయ్! వానోర్ కోమానే!" అని,

"తిశైకళ్ వీశుమ్ శెழு మామణికళ్ శేరుమ్ తిరుక్కుడందై"

అని అంటూ భగవద్భక్తులను కీర్తించారు. ఇక్కడ "శెழு మామణికళ్" అంటే కేవలం మణులు కాదు, భగవద్భక్తులు అనే మణులే. ఈ విధంగా భగవంతునకు ఆనందం కలిగించే భాగవత కీర్తనను ఆళ్వారులు చేశారు.

2) రెండవది ప్రాతికూల్య వర్జనం. భగవంతునకు ఇష్టం కాని కార్యాలను చేయడంనుండి నివర్తించడం. భగవంతునకు నచ్చని విషయం ఏది? అంటే, తనకు భక్తులని చెప్పుకుంటూ, ఇతర దైవాల కాలిలో పడడమే. ఈ అంగాన్ని ఆళ్వారులు ఈ దశకంలో "ఎన్ నాన్ శెయ్ కేన్? యారే కళైకణ్? ఎన్నై ఎన్ శెయ్ కిన్హాయ్? ఉన్నాలల్లాల్ యావరాలుమ్ ఒన్లుమ్ కుఱై వేండేన్"(5–8–3) అని అంటూ, "ఎప్పుడు నీ చరణాలలో శరణాగతి చేశానో, అపుడు ఇక నీవే నన్ను కాపాడాలి. నేను ఇంకొకరి శరణు వేడను, నేను నన్ను రక్షించుకోవడానికి ప్రయత్నం చేయను"– అని అనడం ద్వారా ప్రతికూల్య వర్జనం అనే అంగాన్ని ఆచరించారు.

3) మూడవది– భగవంతుడు తప్పక రక్షిస్తాడు– అనే విశ్వాసాన్ని కలిగి ఉండడం. దీనిని ఆళ్వార్లు "వారా వరు ఎన్ మాయా మాయా మూర్త్తియాయ్,–––ఉనక్కాట్పట్టుమ్ అడియేన్ ఇన్నుమ్ ఉழల్వేనో!" అని అంటూ "నిన్ను ఆశ్రయించిన తరువాత కూడా ఇంకా నేను బాధపడతానా! నీవు నన్ను తప్పక రక్షిస్తావు" అని అనడం ద్వారా మహావిశ్వాసాన్ని ప్రకటించారు.

4) నాల్గవది గోప్తృత్వ వరణం. భగవానుని రక్షకునిగా వరించడం. దీనిని "తళరా ఉడలుమ్ ఎనదావి శరిందు పోంబోదు, ఇళైయాదు ఉన తాళ్ ఒరుంగ ప్పిడిత్తు ప్పోదా విశై నీయే"(5–8–8) అనే ప్రార్థించడం ద్వారా ఆచరించారు.

5) తరువాత, ఐదవది ఆత్మనిక్షేపం. మన రక్షణ భారాన్ని భగవంతుని సన్నిధిలో సమర్పించడం. దీనిని ఆరంభంలోనే "ఆరావముదే!" అని అనడంలో అని ఆచరించారు. "ఆరావముదే! అడియేనుడలమ్ నిన్బాలన్బాయే, నీరాయ్ అలైందు కరైయ ఉరుక్కుకిన్ఱ నెడుమాలే!" అని అంటూ స్వామిని దర్శించిన వెంటనే త సర్వస్వాన్ని స్వామి సన్నిధిలో సమర్పించిన విషయాన్ని విన్నపించారు. "శరీరం, వసు, విజ్ఞానం" అన్నట్లుగా సమస్తం నీకు సమర్పించాను – అని అన్నారు.

6) చివరి అంగం కార్పణ్యం. "నీవు నన్ను కాపాడితే తప్ప వేరొక గతి ఏదీ నాకు లేదు" –అని తెలియజేయడం. దీనిని ఆళ్వారులు "కళైవాయ్ తున్బమ్, కళైయాదొ**ழி**వాయ్, కళైకణ్ మ**ற்றி**లేన్" (నా దుఖాన్ని నీవు తీర్చినా, తీర్చకపోయినా, వేరొక రక్షకుని ఎవరినీ నేను కలిగినవాడను కాను– అని విజ్ఞాపనం చేయడం ద్వారా ఆచరించారు. ఈ అర్థాన్నే దేశికులు "త్వయి రక్షతి రక్షకైః కిమన్యైః? త్వయి చారక్షతి రక్షకైః కిమన్యైః" అని అంటూ అనుసంధించారు.

ఈ విధంగాఅహిర్బుధ్న్యసంహితలో చెప్పిన ప్రకారం షడంగపూర్వకమైన శరణాగతిని ఈ దశకంలో కుంభకోణక్షేత్రంలో నెలకొని ఉండే ఆరావముదా**ழ்**వార్ సన్నిధిలో ఆళ్వారులు ఆచరించారు.

ఈ విధంగా గమనించి చూసినప్పుడు, ఆళ్వారులు కేవలం వేదాన్ని మాత్రమే పాశురాల రూపంలో ద్రావిడీకరించలేదు, పాంచరాత్రాగమ తత్త్వాలను కూడా తమ పాశురాలలో నిక్షిప్తం చేశారు– అనే విషయం స్పష్టమవుతున్నది. ఇక్కడ కేవలం చాలా సంగ్రహంగా మాత్రమే ప్రస్తావించబడింది. ఇంకా చాలా ఉదాహరణలు మనకు దివ్యసూరులు దివ్యప్రబంధాలలో, వాటికి పూర్వాచార్యులు అనుగ్రహించిన వ్యాఖ్యానాలలో పదేపదే గోచరిస్తాయి. వాటిని పెద్దల సన్నిధిలోని విని తెలియవలసి ఉన్నది.స్వస్తి.

★★★★★

# శ్రీపాంచరాత్రం– శ్రీమణవాళ మహామునులు

శ్రీవైష్ణవ సంప్రదాయం పరమ వైదికమైనది. ఇది ఈనాటిది కాదు. అనాదిగా కొనసాగుతూ వస్తున్న సత్సంప్రదాయం.ఇది ఎవరూ కొత్తగా సృష్టించి ప్రవర్తింపజేసినది కాదు. వేదేతిహాస పురాణాలు, అళ్వారుల దివ్య ప్రబంధాలు, పూర్వాచార్యుల శ్రీసూక్తులు మొదలైనవి ఈ సత్సంప్రదాయాన్ని నిరూపించే ప్రమాణాలు. ఇటువంటి ప్రమాణాలలో శ్రీపాంచరాత్రాగమం కూడా ఒకటి.

ఆగమం అనే పదానికి అర్థాన్ని ఏ విధంగా నిర్వహించాలి ? అనేది ఇక్కడ ఒక ప్రశ్న. ఆగమ శబ్దానికి ఇతరులు ఏ విధంగా అర్థాన్ని నిర్వహించారు ? వాస్తవానికి ఏ విధంగా అర్థాన్ని నిర్వహించాలి? సరి అయిన ఆగమం అంటే ఏది ? అనే విషయాన్ని శ్రీమణవాళ మహామునులు అద్భుతంగా నిరూపించారు.

కరుణ అనే గుణమే మూర్తీభవించినవారు భగవద్రామానుజులు. వారి వైభవాన్ని ప్రపంచించడం కోసం ప్రవర్తించిన ప్రబంధమే ఆముదనార్ అనుగ్రహించిన ఇరామానుశ నూత్తన్దాది ప్రబంధం. అందులో ఒక పాశురం ఈ విధంగా ఉన్నది.

మరుళ్ శురన్దు ఆగమ వాదియర్ కూఱుమ్ ★ అవప్పొరుళామ్.
ఇరుళ్ శురన్దెయ్ త్త * ఉలగిరుళ్ నీఙ్గ ★★ తన్ ఈణ్డియ శీర్
అరుళ్ శురన్దు ఎల్లా ఉయిర్ కట్కుమ్ నాతన్ * అరఙ్గన్ ఎన్నుమ్
పొరుళ్ శురన్దాన్ ఎమ్ ఇరామానుశన్ మిక్క పుణ్ణియనే.

సంసారబంధహేతువు అయిన అజ్ఞానం అంతా సమీకృతమై, రుద్రునిచే ప్రవర్తితమైన ఆగమాన్ని ప్రమాణంగా అవలంబించి, వాదం చేసే పాశుపతులు మొదలైనవారు రుద్రపరత్వస్థాపనంకోసం అనేక ఉపపత్తులను కల్పించి చెప్పే చాలా హీనమైన అర్థాలనే అజ్ఞానం అంతటా వ్యాపించగా, ఆ కారణంచేత లోకం నశించిపోయినది. ఆ లోకంలోని అజ్ఞానమనే అంధకారం పోయేటట్లుగా తమకు

గల ఆశ్రితరక్షణం మొదలైన విలక్షణ స్వభావాలను కలిగిన తమ కరుణను వర్షించి, "సకల జీవులకు శేషి శ్రీరంగనాథుడే" అనే అర్థాన్ని శ్రీరామానుజులు ఉపదేశించారు. ఈ విధంగా ఈ అర్థాన్ని మనకు వ్యక్తం చేసిన భగవద్రామానుజులు పరమ ధార్మికులు సుమా!

ఆగమవాదులనే పేరు పెట్టుకుని, దుర్వాదాలను చేసే ఇతరులు అందరూ చెప్పే వాదాలు ఏమీ కూడా వేదాలలో చెప్పబడిన అర్థానికి అనుగుణమైనవి కావని, అందువల్ల ఈ లోకంలో వేదంచేత ప్రతిపాదింపబడిన "శ్రీమన్నారాయణుడే పరతత్వం, అతడే ఉపాయం, అతని కైంకర్యమే ఉపేయం" అనే వాస్తవాన్ని తెలియలేక లోకం నశించిపోయినప్పుడు, భగవద్రామానుజులు అవతరించి, ఇతరులు చెప్పే ఆగమాలు ఏమీ నిజమైన, వేదాల అర్థానికి అనుగుణమైన ఆగమాలు కావని, "శ్రీమన్నారాయణుడే సకల జీవులకు శేషి" అనే సిద్ధాంతాన్ని తెలియజేసే పాంచరాత్రాగమమే నిజమైన ఆగమమని నిరూపించారు. అటువంటి మహోపకారాన్ని చేసిన శ్రరామానుజులు గొప్ప ధార్మికులుసుమా– అనేది పై పాశురంలోని తాత్పర్యం–అని శ్రీమణవాళ మహామునులు ఈ పాశురానికి వివరణను అనుగ్రహించారు.

దీనివల్ల, ఆగమపదానికి సరైన అర్థం పాంచరాత్రాగమనే తప్ప, మిగిలిన ఏవీ ఆగమాలు కావని శ్రీరామానుజులు నిరూపించినట్లుగా శ్రీమణవాళ మహామునులు తెలిపినట్లయినది.

భగవద్రామానుజులు శ్రీభాష్యంలోని ద్వితీయాధ్యాయం రెండవ పాదంలోని ఉత్పత్త్యసంభవాధికరణంలో పాంచరాత్రాగమ ప్రామాణ్యాన్ని ప్రమాణ పూర్వకంగా నిరూపించారు. శ్రీరంగంలో శ్రీరంగనాథుని దివ్యాలయంలో చిరకాలంగా అనుసరింపబడుతూ వస్తున్న పాంచరాత్రాగమారాధనాక్రమాన్ని పలు

ప్రయత్నాలతో పటిష్ఠం చేశారు. యాదవాద్రి అనబడే తిరునారాయణపురంలో తిరునారాయణస్వామి అర్చామూర్తిని ప్రతిష్ఠ చేయించి, ఆ ఆలయంలో పాంచరాత్రాగమప్రకారంగా ఆరాధనాదులు జరిగే ఏర్పాటును చేశారు. అంతకు ముందు భగవద్యామునులు కూడా ఆగమప్రామాణ్యం అనే గ్రంథంలో పాంచరాత్రాగమ ప్రామాణ్యాన్ని నిరూపించారు. శ్రీవేదాంత దేశికులు కూడా పాంచరాత్ర రక్ష అనే గ్రంథంలో పాంచరాత్రాగమ ప్రామాణ్యాన్ని నిరూపించారు. ఈ విధంగా మన పూర్వాచార్యులు అందరూ ఆదరించి, అనుసరిస్తూ వచ్చే, వేదసిద్ధాంతానికి అనుకూలమైనది అయిన పాంచరాత్రాగమానికి చెందిన పలు సంహితలలోని అర్థాలను మన పూర్వాచార్యులు తమ వ్యాఖ్యాన గ్రంథాలలో, తమ స్వతంత్ర గ్రంథాలలో ప్రస్తావించిన వైనం ప్రచురంగా కనిపిస్తుంది. ప్రస్తుతం, మన పూర్వాచార్యపరంపరలో చివరివారైన శ్రీమణవాళ మహామునులు తమ గ్రంథాలలో పాంచరాత్రాగమసూక్తులను ప్రమాణీకరించిన విషయాన్ని స్థాలీపులాకన్యాయంలో గమనిద్దాం.

శ్రీమణవాళ మహామునులు శ్రీరంగంలోని పల్లవరాయమఠంలో నివసించేటప్పుడు, తమ శిష్యవర్గానికి ఏ విధంగా గ్రంథకాలక్షేపాన్ని అనుగ్రహించేవారో, దానిని మనకు యతీంద్ర ప్రవణ ప్రభావం అనే వారి చరిత్రను తెలిపే గ్రంథం తెలియజేస్తున్నది. శ్రీమణవాళ మహామునులు అవతరించడానికి ముందు కాలంలో శ్రీరంగప్రాంతంలో జరిగిన తురుష్కుల దండయాత్రలో పూర్వాచార్యుల గ్రంథాలు అనేకంగా లుప్తమయ్యాయి. చాలా గ్రంథాలను తురుష్కులు దగ్ధం చేసినట్లు చరిత్ర చెబుతున్నది. లోపించగా మిగిలిన గ్రంథాలను సమీకరించి రక్షించే ప్రయత్నాన్ని శ్రీవరవరమునులకు ఆచార్యులైన శ్రీశైలపూర్ణులు అనే తిరువాయ్ మొழிప్పిళ్ళై ప్రారంభించారు. ఆ ప్రయత్నాన్ని శ్రీమణవాళ

మహాములు కొనసాగించినట్లు యతీంద్రప్రవణ ప్రభావం తెలుపుతున్నది. వారు ఆ విధంగా పూర్వాచార్యుల గ్రంథాలను సేకరించి రక్షించడమే కాక, వాటిలో ఉండే పలు సూక్తులను తమ వ్యాఖ్యానగ్రంథాలలో ప్రమాణాలుగా కూడా ఉదాహరించారు. తాము పూర్వాచార్యగ్రంథాలను కాలక్షేపం అనుగ్రహించేటప్పుడుకూడా ఆ గ్రంథాలనుండి పలు సూక్తులను ఉట్టంకించి వివరించారు. ఆ విధంగా శ్రీవరవరమునులు ప్రయత్నించి, సేకరించి సంపాదించిన గ్రంథాలలో పాంచరాత్రాగమగ్రంథాలుకూడా ఉన్నాయి.

ఆ పాంచరాత్రసంహితలలోనుండికూడా శ్రీవరవరమునులు ఎన్నో ప్రమాణాలను తమ ఉపన్యాసాలలో, గ్రంథాలలో ప్రస్తావించారు –అని కూడా యతీంద్రప్రవణప్రభావం తెలుపుతున్నది. విశేషం ఏమంటే, శ్రీనాథమునులనుండి ఆరంభించి, శ్రీమద్వేదాంతదేశికుల వరకు ఉండే కాలంలో అవతరించిన, లభ్యమవుతున్న పూర్వాచార్య గ్రంథాలను అన్నిటినీ అవలోకించి, వాటిలోని విశేషాలను గ్రహించినవారు మణవాళ మహాములు ఒక్కరే. అందువల్ల, ఈ గ్రంథాలలో వ్యక్తం అవుతున్న పూర్వాచార్యులందరి హృదయాల ఆకళింపు చేసికొని, సంశయ విపర్యయ రహితంగా వాటిని గ్రహించి, అనుగ్రహించినవారు వీరు ఒక్కరే. ఈ విధంగా పలు పూర్వాచార్యగ్రంథాలలోని సూక్తులను ఆధారంగా చేసికొని, శ్రీమణవాళ మహాములు గ్రంథకాలక్షేపాన్ని అనుగ్రహించే రీతిని కూడా యతీంద్రప్రవణ ప్రభావం తెలుపుతూ,

"శ్రుతిస్మృతీతిహాసైశ్చ శ్రుత్యంతైః పాంచరాత్రతః,
దేశికానాం నిబంధ్రూణాం దర్శయన్నేకకంఠతామ్,
వాక్యాలంకారవాక్యాని వ్యాచక్షణో విచక్షణః,
సుధియః స్వాదయామాస స్వస్వరూపం సుదుర్లభమ్"

(వేదవాక్యాలతో, మనుస్మృతి మొదలైన స్మృతివాక్యాలతో, శ్రీరామాయణం మొదలైన ఇతిహాసాలతో, వేదాంతవాక్యాలతో, పాంచరాత్ర ప్రమాణాలతో గ్రంథకర్తలైన పూర్వాచార్యుల ఏకాభిప్రాయాన్ని తెలియజేస్తూ,,సమర్థులైన శ్రీమణవాళ మహామునులు శ్రీవచనభూషణ వాక్యాలను వ్యాఖ్యానిస్తూ, జ్ఞానులకు తెలియడానికి సాధ్యం కాని ఆత్మస్వరూప యాథాత్మ్యాన్ని స్పష్టంగా తెలియజేసి, వారిని ఆనందింప చేశారు) అని అన్నది. దీనివల్ల శ్రీమణవాళ మహామునులు శ్రుతులను మాత్రమే కాదు, స్మృతులను మాత్రమే కాదు, వేదాంతాలను మాత్రమే కాదు, పాంచరాత్రాగమ ప్రమాణాలను కూడా అనుగ్రహిస్తూ వారు తమ కాలక్షేపాన్ని అనుగ్రహించేవారని తెలుస్తున్నది. శ్రీరంగనాథుని దివ్యాలయంలో గరుడ మంటపంలో ఈడు ముప్పత్తాఱాయిరప్పడి వ్యాఖ్యానాన్ని కాలక్షేపంగా అనుగ్రహించేటప్పుడు 9 విధాలైన ప్రక్రియలలో వారు ఆ కాలక్షేపాన్ని అనుగ్రహించినట్లుగా యతీంద్రప్రవణ ప్రభావం తెలుపుతున్నది. శ్రుతిప్రక్రియ, శ్రీభాష్యప్రక్రియ, శ్రుతప్రకాశికా ప్రక్రియ, గీతాభాష్య ప్రక్రియ, శ్రీరామాయణ ప్రక్రియ, మహాభారత ప్రక్రియ, శ్రీవిష్ణుపురాణప్రక్రియ, మహాభాగవతప్రక్రియ శ్రీపాంచరాత్రప్రక్రియ అని ఈ తొమ్మిది విధాలైన ప్రక్రియలలో వారు తమ కాలక్షేపాన్ని అనుగ్రహించేవారు. పదార్థ, వాక్యార్థ,మహావాక్యార్థ,, వ్యంగ్యార్థ విశేషాలను వివరిస్తూ, శబ్దరస, అర్థరస భావరసాదులను అద్భుతంగా వివరణను అనుగ్రహించారు.

శ్రీమణవాళ మహామునులు తమ గ్రంథాలలో ప్రస్తావించిన పాంచరాత్రాగమ గ్రంథాలను గూర్చి పరిశీలించి చూసినప్పుడు, మనకు తెలిసినంతవరకు 18 విధాలైన పాంచరాత్రాగమ సంహితలను ప్రమాణీకరించినట్లు కనిపిస్తుంది. మన పూర్వాచార్యులలో ఏ ఆచార్యులు కూడా ఇన్ని పాంచరాత్రాగమ

గ్రంథాలను ప్రస్తావించినట్లుగా కనిపించదు. ఇందువల్ల శ్రీవరవరమునులకు శ్రీపాంచరాత్రాగమం పట్ల ఉండే ఆదరం, ప్రామాణికత ఎటువంటిదో మనం గమనించవచ్చు. ఆ సంహితలు ఏవి ? అంటే, శేషసంహిత, విహగేంద్ర సంహిత,లక్ష్మీతంత్రం, అహిర్బుధ్న్యసంహిత, జయసంహిత,పరమసంహిత, పాద్మసంహిత, విష్వక్సేనసంహిత భరద్వాజసంహిత, సనత్కుమార సంహిత, శౌనక సంహిత, కాశ్యప సంహిత, హారీత సంహిత, భరత ముని అనుగ్రహించిన విష్వక్సేన సంహిత, సాత్వత సంహిత, జయాఖ్య సంహిత, ఈశ్వర సంహిత అని మొదలుగా 18 సంహితలనుండి వందలాది ప్రమాణాలను తమ గ్రంథాలలో ఉదాహరించారు.

శ్రీవచనభూషణ దివ్యగ్రంథ వ్యాఖ్యానంలో వ్యాఖ్యానంలో ఒకచోట శ్రీమణవాళ మహామునులు, పాంచరాత్ర సంహితలు ఎన్ని? అనే విషయాన్నికూడా విచారించి, మనకు తెలియజేశారు. పాంచరాత్రాగమంలో ఎన్ని సంహితలు ఉన్నాయో, ఆ విషయాన్ని మనం ముందు తెలుసుకోవాలి కదా. శ్రీవచనభూషణ దివ్యగ్రంథ వ్యాఖ్యానంలోని 392 వ సూత్రంలో శ్రీపిళ్ళై లోకాచార్యులవారు "భగవంతుడు జీవుని తన నిర్హేతుకమైన కరుణతో అనుగ్రహిస్తాడు"అనే విషయాన్ని తెలియజేయడం కోసం భగవంతుని నిర్హేతుకవిషయీకారక్రమాన్ని తెలుపుతూ, "యథా హి మోషకాః పాంథే" ఇత్యాదిగా ఆరంభించి, దీని క్రమం భగవచ్ఛాస్త్రంలో చెప్పబడింది" అని, ఇది పాంచరాత్రాగమంలో కూడా చెప్పబడిందని అన్నారు. ఈ సూత్రాన్ని వ్యాఖ్యానించడం ఆరంభించిన శ్రీవరవరమునులు –" ఈ నిర్హేతుక విషయీకారక్రమం శాస్త్రంలో ఎక్కడ చెప్పబడింది? అని అంటే, బదులు పలుకుతున్నారు– "యథా హి మోషకాః పాంథే" ఇత్యాదిగా ఆరంభించి భగవచ్ఛాస్త్రం 108 సంహితల రూపంలోకదా ఉన్నది. వాటిలో ఒకటి కదా అహిర్బుధ్న్యసంహిత. "పంచరాత్రస్య కృత్స్నస్య వక్తా నారాయణః స్వయమ్"

(సమస్తమైన పాంచరాత్ర శాస్త్రానికి ఆదివక్త స్వయంగా శ్రీమన్నారాయణుడే) అని ఈ ఆగమానికి అంతటికి ఆదివక్త భగవంతుడై ఉన్నప్పటికీ, ఆ యా సంహితలకు సంబంధించి అవాంతర వక్తలు ఉన్నారు కదా. వాటిలో ఈ సంహితకు వక్త అహిర్బుధ్న్యుడు అనే పేరు కలిగిన ఈశ్వరుడు కనుక, ఇది "ఆహిర్బుధ్న్య సంహిత " అని వ్యవహరింపబడుతున్నది. ఆ సంహితలోని 14వ అధ్యాయంలో ఈ విషయం చెప్పబడింది" అని స్పష్టంగా ఈ శాస్త్రానికి ఆదివక్త ఎవరో, ఈ శాస్త్రంలో ఎన్ని సంహితలు ఉన్నాయో, ఆ యా సంహితలకు ఆ యా నామాలు రావడానికి గల హేతువు ఏదో, భగవంతుని నిర్హేతుకవిషయీకారక్రమం ఆ సంహితలో ఎక్కడ చెప్పబడిందో వివరించారు. ఇది, వీరి విశదవాక్ శిఖామణిత్వానికి ఒక ఉదాహరణం.

ఈ విధంగా వరవరమునలు ప్రమాణీకరించిన అనేక సంహితలలో, నాలుగైదు సంహితలను మాత్రం ప్రస్తావించి, వాటిలోని ఏయే సూక్తులను వరవరమునులు ఏ ఏ సందర్భాలలో ఉదాహరించారో కొంచెం గమనిద్దాం.

శ్రీవరవరమునులు అనుగ్రహించిన వ్యాఖ్యానగ్రంథాలలో ప్రధానమైనవి ముముక్షుప్పడి అనబడే తిరుమంత్రార్థ గ్రంథానికి వ్యాఖ్యానం, శ్రీవచన భూషణగ్రంథవ్యాఖ్యానం, తత్త్వత్రయగ్రంథ వ్యాఖ్యానం, ఆచార్యహృదయ గ్రంథవ్యాఖ్యానం. ఇవికాక పెరియాళ్వార్ తిరుమొళి ప్రబంధవ్యాఖ్యానం, జ్ఞానసార ప్రమేయప్రబంధాలకు సారవ్యాఖ్యానాలు అనేవి. ఇవి కాక, జీయర్ పడి అని పిలువబడే తిరువారాధనక్రమాన్ని తెలిపే గ్రంథాన్నికూడా వీరు రచించారు.

అరుళాళ ప్పెరుమాళ్ ఎంబెరుమానార్ అనే ఆచార్యులు భగవద్రామానుజులకు సమకాలీనులు, వారి శిష్యులు కూడా. వీరు సాటి లేని శాస్త్ర పాండిత్యం కలవారు. పలు అమూల్యమైన, శాస్త్రసారాలైన విషయాలను జ్ఞానసారం అనే చిన్న ప్రబంధంలో 40 పాశురాల రూపంగా అనుగ్రహించారు. దానికి

శ్రీవరవరమునులు చాలా అందమైన వ్యాఖ్యానాన్ని అనుగ్రహిస్తూ, పలు పాశురాలను వివరించేటప్పుడు పాంచరాత్రసంహితలలోనుండి పలు ప్రమాణాలను ఉదాహరించడంద్వారా ఆ పాశురాలలో చెప్పబడిన విషయాలకు మూలం భగవచ్ఛాస్త్రసూక్తులే అనే విషయాన్ని నిరూపించారు.

ఉదాహరణకు, ముందుగా, ఆ ప్రబంధంలోని 31వ పాశురాన్ని గమనిద్దాం.

వేదమొరు నాన్గిన్ ఉట్పొదింద మెయ్ ప్పొరుళుమ్
కోదిల్ మను ముదల్ కూఱువదుమ్–తీదిల్
శరణాగతి తంద తన్నిఱైవన్ తాన్ అరణాగు మెన్ను మదు

"ఏ దోషం లేని శరణాగతిని తనకు ఉపదేశించిన ఆచార్యుని శ్రీచరణాలే రక్షకం" అనే విషయం – సాటి లేని నాలుగు వేదాలను తన లోపల ఇముడ్చుకున్న యథార్థమైన, ఏ దోషం లేని మనుస్మృతి మొదలైన గ్రంథాలు తెలిపే అర్థం.
శ్రీవరవరమునులు ఈ పాశురాన్ని వ్యాఖ్యానించి, చివరలో, "తాను ఆశ్రయించిన శ్రీ ఆచార్యుని శ్రీచరణలే రక్షకం" అనే అర్థం సాత్విక సంహితలో తెలుపబడిందని వివరిస్తూ,

"గురురేవ పరం బ్రహ్మ గురురేవ పరా గతిః,
గురురేవ పరా విద్యా గురురేవ పరం ధనమ్,
గురురేవ పరః కామో గురురేవ పరాయణమ్,
యస్మాత్తదుపదేష్టా ఽసౌ తస్మాద్గురుతరో గురుః,
అర్చనీయ శ్చ వంద్య.శ్చ కీర్తనీయ శ్చ సర్వదా,
ధ్యాయేజ్జపే న్నమేద్భక్త్యా భజే దభ్యర్థయే న్మదా,
ఉపాయోపేయభావేన తమేవ శరణం వ్రజేత్,
ఇతి సర్వేషు వేదేషు సర్వశాస్త్రేషు శబ్దితమ్,
ఏవం ద్వయోపదేష్టారం భావయేద్బుద్ధిమాన్ ధియా"

(గురువే పరబ్రహ్మ, గురువే గొప్ప ఉపాయం, గురువే గొప్ప విద్య, గురువే గొప్ప సంపద, గురువే గొప్ప మనోరథం, గురువే గొప్ప ప్రాప్యం, భగవంతుని గూర్చియే గురువు ఉపదేశిస్తాడు అందువల్ల ఆ భగవంతుని కంటే గురువు గొప్పవాడు. అందువల్ల ఆచార్యుని సదా అర్చించాలి, నమస్కరించాలి, సంకీర్తనం చేయాలి, గురువునే ప్రీతితో ధ్యానించాలి, జపించాలి, భక్తితో నమస్కరించాలి, స్తుతించాలి. ఉపాయం,గా ఉపేయంగా ఆచార్యునే శరణు పొందాలి. ఈ విషయం అన్ని వేదాలలో, అన్ని శాస్త్రాలలో సమ్మతమైనది. అందువల్ల జ్ఞాని అయినవాడు ద్వయాన్ని ఉపదేశించిన ఆచార్యుని ఈ విధంగా భావించాలి) అని శ్రీసాత్త్వతతంత్రంలోని ద్వయప్రసంగంలో, ఆ ద్వయమంత్రాన్ని ఉపదేశించిన ఆచార్యుని వైభవం భగవంతునిచే అనుగ్రహింపబడింది కదా" అని అన్నారు.

ఈ ప్రబంధంలోని మొదటి పాశురమే పాంచరాత్రాగమానికి చెందిన సనత్కుమార సంహితలోని ఒక సూక్తిని ఆధారంగా చేసుకుని అనుగ్రహింపబడిందని శ్రీవరవరమునులు తమ వ్యాఖ్యానంలో తెలియజేశారు. ఆ పాశురం ఈ విధంగా ఉన్నది.

ఊన ఉడల్ శిఱై నీత్తోణ్ కమలై కేళ్వనడి
తేనుగరు మాశై మిగు శిందైయరాయ్– తానే
పழுత్తాల్ వీழுమ్ కనిపోల్ పற்றறற்று వీழுమ్
విழுక్కాడే తానరుళుమ్ వీడు.

"మాంసప్రచురమైన దేహమనే చెరసాలను విడచిపెట్టి, అందమైన తామర పువ్వును తన నివాసస్థానంగా కలిగిన లక్ష్మీదేవియొక్క వల్లభుని తేనెవలె భోగ్యాలైన శ్రీచరణాలను అనుభవించాలి" అనే ఆశను మిక్కిలిగా కలిగినవారై, పండితే తనకు తానే కిందకు రాలే పండువలె, లోకంలో ఉండే ప్రాప్యప్రాపకాలతో

సంబంధాన్ని,ఆశను విడిచిపెట్టి, భగవంతుని శ్రీచరణాలలో శరణాగతి చేసే విధంగా అప్రయత్నంగా వాలడమనే ఆర్తప్రపత్తియే మోక్షాన్ని కలిగిస్తుంది.

ఈ పాశురంలో "పఱ్ఱఱ్ఱు వీழ்మ్ విழ்క్కాడే" అని ప్రస్తావింపబడిన ఆర్తప్రపత్తిస్వరూపాన్ని వివరించే సందర్భంలో శ్రీవరవరమునులు

"యదా పరానన్వయిభిః దుశ్శకః స్మృతిభి ర్వినా,
తేన తత్పురతః పాతః సా ప్రపత్తి స్తదా భవేత్"

(పరమాత్మతో సంబంధం లేని, సహించడానికి సాధ్యం కానివి అయిన అన్యప్రాపకప్రాప్యాల స్మృతి లేకుండా, చాలా ఆర్తితో ఆ భగవంతుని సమక్షంలో ఎపుడు వాలుతారో, అప్పుడు అది ఆర్తప్రపత్తి అని చెప్పబడుతున్నది) అనే సనత్కుమార సంహితలోని అర్థని ఆర్తప్రపత్తినిరుక్తిని ఉదాహరించారు.

"విழ்క్కాడే తానరుళుమ్ వీడు" (ఆర్తప్రపత్తి కనుక, ఆలస్యం లేకుండా మోక్షాన్ని ఇస్తుంది) అనే ప్రయోగానికి ప్రమాణంగా పంచరాత్రశాస్త్రంలోని –

"ఆర్తానా మాశు ఫలదా సకృదేవ కృతా హ్యసౌ,
దృప్తానామపి జంతూనాం దేహాంతరనివారిణీ"

(ఒకసారి చేయబడిన ఈ ప్రపత్తి, ఆర్తితో చేసినవారికి వెంటనే ఫలాన్ని ఇస్తుంది. దృప్తప్రపన్నులకు కూడా ఆ దేహం చివరిలో వేరొక దేహం కలుగని రీతిలో సహాయపడుతుంది) అనే సూక్తిని ఉదాహరించారు.

ఇప్పుడు, నాల్గవ పాశుర వ్యాఖ్యానాన్ని గమనిద్దాం.

మఱ్ఱొన్ఱై ఎణ్ణాదే మాదవనుక్కాట్చెయలే
ఉఱ్ఱదిదు ఎన్ఱు ఉళమ్ తెళిందు– పెఱ్ఱ
పెరుమ్ పేఱ్ఱిన్ మేలుళతో పేఱెన్ఱిరుప్పార్
అరుమ్ పేఱు వానత్తవర్ క్కు

భగవంతుని కైంకర్యం కంటే ఇంకొక విషయాన్ని ప్రయోజనంగా భావించకుండా, లక్ష్మీనాథుని దాస్యాన్ని " ఇది నా స్వరూపానికి తగినది" అని మనస్సులో స్పష్టంగా తెలుసుకొని, దానిని చేస్తే, మనం పొందిన ఈ గొప్పదైన ప్రాప్యం కంటే ఇంకొక గొప్ప ప్రాప్యం ఉన్నదా? లేదుకదా" అని భావించేవారు నిత్యసూరులకు అరుదైన ప్రాప్యమై ఉంటారు.

ఇది భగవదైక కైంకర్యాన్ని పరమప్రాప్యంగా తలచేవారి వైభవాన్ని తెలియజేస్తున్నది. పరమైకాంతులుగా ఉండేవారు భగవంతుని కైంకర్యం కంటే వేరొకదానిని దేనినీ పరమప్రయోజనంగా భావించరుకదా. అటువంటి మహానుభావులు పరమపదానికి వెళ్ళినప్పుడు, వారి కంటే గొప్ప అతిథులు వేరొకరు లేరని పరమపదంలో భగవంతునకు నిత్యదాస్యాన్ని చేసే నిత్యసూరులు భావిస్తారు–అనే ఈ విషయాన్ని తెలిపే–

"యే బ్రహ్మన్! భగవద్దాస్యభోగైకనిరతా స్సదా,
తే ప్రియాతిథయః ప్రోక్తాః శ్రీవైకుంఠ నివాసినామ్"

అనే ఒక పాంచరాత్రశాస్త్రప్రమాణాన్ని ఇక్కడ శ్రీవరవరమునులు ఉదాహరించారు.

ఇప్పుడు ఇంకొక పాశురవ్యాఖ్యానాన్ని గమనిద్దాం.

"తన్ పొన్నడి యన్ఱి మற்றொన్ఱిల్ తాழ్వు శెయ్యా
అన్బర్ ఉగందిట్టదు అణువెనినుమ్– పొన్ పిఱழும్
మేరువాయ్ క్కొళ్ళుమ్ విరైయార్ తుழாయలంగల్
మారిమాక్కొండల్ మాల్"

సువాసన నిండుగా కలిగిన తులసీమాలికతో అలంకరింపబడిన, వర్షించే నల్లని మేఘంవంటి రూపాన్ని కలవాడైన, భక్తవ్యామోహాన్ని కల భగవంతునియొక్క,

బంగారు వలె ఆశపడదగిన శ్రీచరణాలు తప్ప, వేరొక ప్రాప్యంలో అభినివేశాన్ని పొందని భక్తిని కలవారు అభిమానించి ఆనందంగా సమర్పించినది, అనణువువలె చాలా చిన్నది అయినా, దానిన బంగారుమయంగా ఉండే మేరుపర్వతంవలె గొప్పగా భావించి, భగవానుడు స్వీకరిస్తాడు.

భగవంతుని చరణాలలో అనన్య ప్రయోజనమైన భక్తిని కలిగినవారు సాదరంగా సమర్పించే ద్రవ్యం చాలా తక్కువది అయినా, భగవంతుడు దానిని చాలా గొప్పగా భావించి, అంగీకరించే రీతి ఈ పాశురంలో చెప్పబడుతున్నది.

శ్రీవరవరమునులు ఈ పాశురాన్ని వ్యాఖ్యానించి, చివరిలో ఇందులో తెలుపబడిన అర్థం పాంచరాత్రాగమానికి సంబంధించిన పౌష్కర సంహితలోని–

"భక్తై రణ్వప్యుపానీతం ప్రేమ్ణా భూర్యేవ మే భవేత్,
భూర్యప్యభక్తోపహృతం న మే తోషాయ కల్పతే"

(నా భక్తుల చేత సమర్పింపబడినది చాలా చిన్నది అయినా, అతని ప్రేమ కారణంగా అది నాకు చాలా గొప్పది అవుతుంది. భక్తి లేనివాడు పెద్ద వస్తువును సమర్పించినా, అది నాకు సంతోషాన్ని కలిగించదు) అనే వచనంలో భగవంతుడే స్వయంగా పలికినట్లు తెలియజేశారు.

ఇప్పుడు 28వ పాశురవ్యాఖ్యానాన్ని చూద్దాం.

శరణాగతి మற்றோర శాదనత్తై ప్పற்றில్
అరణాగాదు, అంజనైతన్ శేయ్దై – మురణழியు
క్కట్టియదు వేఱోర్ క్కయిఱుకొండార్ ప్పదన్ మున్
విట్ట పడైపోల్ విడుమ్.

మహావిశ్వాసాన్ని పురస్కరించుకొని చేయబడే శరణాగతి అనేది, వేరొక ప్రయత్నంతో చేయబడే కర్మయోగం, జ్ఞానయోగం మొదలైన ఉపాయాలలో ఒక

ఉపాయాన్ని మోక్షసాధనంగా గ్రహిస్తే, ఆ శరణాగతి రక్షకం కాకుండా పోతుంది. అంజనాదేవి కుమారుడైన హనుమంతుని "అతని బలం నశించడం కోసం ఇంద్రజిత్తు ప్రయోగించిన బ్రహ్మాస్త్రం చాలదు" అనే భావంతో ఇంకొక జనుప నారదారంతో రాక్షసులు కట్టడం ఆరంభించినప్పుడే తన శక్తిని ఉపసంహరించుకున్న బ్రహ్మాస్త్రం వలె, శరణాగతి కూడా నిష్ఫలం అవుతుంది.

ఈ పాశురంలో ఒక గొప్ప శాస్త్రార్థం తెలుపబడుతున్నది. శరణాగతి అనే ఉపాయం బ్రహ్మాస్త్రంవంటిది. బ్రహ్మాస్త్రం చాలా గొప్పదైన అస్త్రమైనప్పటికీ,, అది ఇంకొక అస్త్రంయొక్కగాని, ఆయుధంయొక్కగాని (సాధన) స్పర్శ కలిగితే, ఆ బ్రహ్మాస్త్రం తన శక్తిని వెంటనే ఉపసంహరించుకుంటుంది. ఆ విధంగానే, శరణాగతి కూడా కర్మయోగ జ్ఞానయోగాది ఉపాయాంతరాల సంబంధం ఉంటే, పనిచేయదు –అనేది శరణాగతి స్వరూపం.. ఆ విషయం ఇక్కడ తెలుపబడింది.

శ్రీవరవరమునులు ఈ పాశురాన్ని వ్యాఖ్యానించిన తరువాత, చివరలో, ఇందులో చెప్పబడిన ప్రపత్తిస్వరూపం సనత్కుమార సంహితలో తెలుపబడిన రీతిని తెలియజేస్తూ, ఈ క్రింది శ్లోకాలను ఉదాహరించారు.

"ప్రపత్తేః క్వచిదప్యేవం పరాపేక్షా న విద్యతే,
సా హి సర్వత్ర సర్వేషాం సర్వకామఫలప్రదా,
సకృదుచ్చారితా యేన తస్య సంసారనాశినీ,
రాక్షసానా మవిస్రంభా దాంజనేయస్య బంధనే,
యథా విగలితా సద్య స్త్వమోఘా ఽ స్యాస్త్రబంధనా,
తథా పుంసా మవిస్రంభాత్ ప్రపత్తిః ప్రచ్యుతా భవేత్,
తస్మాద్విస్రంభయుక్తానాం ముక్తిం దాస్యతి సా ఽ చిరాత్"

(ప్రపత్తి అనే మోక్షోపాయం ఫలించడానికి, భక్తి మొదలైన ఉపాయాలకువలె, వేరు ఈ ఉపాయంయొక్క సహాయం ఆవశ్యకం కాదు. ఆ ప్రపత్తి

అనే ఉపాయమే అందరికీ అన్ని వేళల అన్ని కోరికలను సిద్ధింపచేస్తుంది కదా. ఎవడు, ఒకసారి ఈ ఉపాయాన్ని ఆచరిస్తున్నాడో అతనికి ఇది సంసార బంధాన్ని లేకుండా చేస్తుంది. "అమోఘమైన బ్రహ్మాస్త్రబంధం ఆంజనేయుని బంధించడానికి సరిపోతుంది" అనే నమ్మిక రాక్షసులకు లేనందువల్ల వారు నారపగ్గాలతో అతనిని కట్టారు. వెంటనే ఆ అస్త్రబంధనశక్తి ఆంజనేయుని విడిచి పెట్టింది. ఆ విధంగానే "భగవంతుడు రక్షకుడు" అనే నమ్మిక ప్రపత్తిని ఆచరించేవారికి లేకపోతే, వారు చేసే ప్రపత్తి నిష్ఫలం అవుతుంది. అందువల్ల నమ్మికను కలిగినవారికి ప్రపత్తి శీఘ్రంగానే మోక్షాన్ని ఇస్తుంది.)

37 వ పాశురాన్ని ఇప్పుడు గమనిద్దాం.

**పొరుళు ముయిరు ముడంబుమ్ పుగలుమ్**
**తెరుళుమ్ గుణముమ్ శెయలుమ్– అరుళ్ పురింద**
**తన్నారియన్ పొరుట్టా చ్చంకళ్ళుమ్ శెయ్ బవర్ నెంజు**
**ఎన్నాళు మాలుక్కిడమ్.**

తనకు కల సంపద, ప్రాణం, శరీరం, గృహం, జ్ఞానం, గుణాలు, తన కృత్యాలు అనే ఇవి అన్ని తనను అనుగ్రహించిన ఆచార్యుని కోసమే ఉన్నాయి– అని సంకల్పం చేసేవారి మనసు అన్ని సమయాలలోను భగవంతుడు నివసించే నివాసం కాగలదు.

ఆచార్యుని విషయంలో ఏకాంతమైన భక్తి కలిగినవారి వైభవం ఇందులో తెలుపబడుతున్నది. తనకు కల సంపద, ప్రాణం, శరీరం మొదలైనవి అన్ని ఆచార్యులకు శేషం– అని భావించేవారి మనస్సు సర్వేశ్వరునకు అన్ని సమయాలలోనూ వాసస్థానం అవుతుంది– అనే విషయం ఈ పాశురంలో తెలుపబడుతున్నది.

దీనిని వ్యాఖ్యానించిన శ్రీ వరవరమునులు, తమ వ్యాఖ్యానం చివరిలో పాంచరాత్రాగమానికి సంబంధించిన జయసంహితలో శ్రీవరాహ స్వామి అనుగ్రహించిన

"శరీరం వస విజ్ఞానం వాసః కర్మ గుణానసూ,
గుర్వర్థం ధారయే ద్యస్తు స శిష్యో నేతరః స్మృతః,
గుర్వర్థం స్వాత్మనః పుంసః కృతజ్ఞస్య మహాత్మనః,
సుప్రసన్నః సదా విష్ణుః హృది తస్య విరాజతే"

(శరీరం, ధనం జ్ఞానం, నివాసం, తాను చేసే కర్మలు, తనకు కల గుణాలు, తన ప్రాణం అనేవి అన్నీ ఆచార్యుని కోసమే ఉన్నాయి– అనే నిశ్చయాన్ని ఎవడు కలిగి ఉంటాడో, అతడే శిష్యుడు. మిగిలినవాడు శిష్యుడు కాడు– అని శాస్త్రాలు చెబుతున్నాయి. ఆచార్యుని కోసం తనను నివేదించుకొని ఉపయోగపడేవాడై, ఆచార్యుడు చేసిన మేలును మరువనివాడై, అందువల్లనే గొప్పవాడై ఉండే శిష్యుని విషయంలో భగవంతుడు చాలా ప్రీతిని కలవాడై, అతని మనసులో ఎల్లప్పుడూ నివసిస్తాడు) అనే ఈ సూక్తులను సంవాదంగా అనుసంధించాలి –అని తెలియజేశారు. ఈ సూక్తి పంచమోపాయ వైభవాన్ని తెలియజేస్తున్నది. ఈ విషయమే సకల వేదసారంగా, ఆళ్వారుల దివ్యప్రబంధాల సారంగా శ్రీవచన భూషణ దివ్యగ్రంథంలో నిర్ణయింపబడింది కదా.

ఇక చివరిగా 38 వ పాశురాన్ని చూద్దాం.

తేనార్కమల త్తిరుమామగళ్ కొழునన్
తానే గురువాగి తన్నరుళాల్ – మానిడర్ క్కాయ్
ఇన్నిలత్తే తోన్షుదలాల్ యార్ క్కుమవన్ తాళిణైయై
ఉన్నువదే శాల ఉఱుమ్.

తేనె నిండుగా ఉండే తామర పువ్వును నివాసంగా కలిగిన లక్ష్మీదేవికి వల్లభుడయిన భగవంతుడు తానే స్వయంగా మానవరూపాన్ని ధరించిన ఆచార్యుడై, తన నిరవధికమైన కృపతో ఈ మానవులకోసం వారు నివసించే ఈ లోకంలో అవతరించినందువల్ల, జీవులందరూ ఆచార్యుని ఆశ్రయించడమే వారి స్వరూపానికి చాలా తగినది.

సదాచార్య వైభవాన్ని అనేక విధాలుగా తెలియజేసే సందర్భంలో ఈ పాశురం ఉన్నది. ఆచార్యుడు భగవంతుని అవతార రూపమే– అనే విషయాన్ని తెలియజేసి, ఈ విధంగా ఉన్నందువల్ల అందరికీ సదాచార్యుని చరణాలను ఆశ్రయించి, అనుసంధించడమే వారి స్వరూపానికి చాలా తగినది– అనే ఈ అర్థాన్ని ఈ పాశురంలో తెలియజేయడం జరుగుతున్నది.

శ్రీమణవాళ మహామునులు ఈ పాశురాన్ని వ్యాఖ్యానించి, చివరిలో జయాఖ్య సంహితలోని శాండిల్య వచనాలు ఈ పాశురంలోని అర్థానికి సంవాదంగా అనుసంధించుకోవాలని తెలుపుతూ, ఆ వచనాలను ఈ క్రింది విధంగా ఉదాహరించారు.

"సాక్షాన్నారాయణో దేవః కృత్వా మర్త్యమయీం తనుమ్,
మగ్నా నుద్ధరతే లోకాన్ కారుణ్యాత్ శాస్త్రపాణినా,
తస్మాత్ భక్తిః గురౌ కార్యా సంసారభయభీరుణా"

(భగవానుడైన శ్రీమన్నారాయణడే స్వయంగా మానవరూపాన్ని ధరించి, సంసారం అనే సముద్రంలో మునిగి ఉండే జీవులను శాస్త్రం అనే చేయూతను ఇచ్చి, కరుణతో ఉద్ధరిస్తున్నాడు. అందువల్ల సంసారంపట్ల భయం కలిగినవారు ఆచార్యుని విషయంలో భక్తిని కలిగి ఉండాలి)

ఇప్పుడు మరికొన్ని వ్యాఖ్యాన గ్రంథాలనుండి కొన్ని ఉదాహరణలను గమనిద్దాం.

శ్రీవరవరమునులు అనుగ్రహించిన వ్యాఖ్యానగ్రంథాలలో తత్త్వత్రయ వ్యాఖ్యాన గ్రంథం తలమానికమైనది. ఇది భగవద్రామానుజుల శ్రీభాష్యంతో సమానమైనది– అని పెద్దల భావన. అందువల్లనే దీనికి కుట్టిశ్రీభాష్యం అనే వ్యవహారం కూడా ఉన్నది. తమకు ముందు ఉన్న పూర్వాచార్యులు అనుగ్రహించిన శాస్త్రార్థాలను అన్నిటిని తమ ఈ వ్యాఖ్యానంలో శ్రీవరవరమునులు ప్రస్తావించారు.
ఆ గ్రంథంలోని ఈశ్వరప్రకరణంలో, 42వ సూత్రంలో ఈశ్వరతత్త్వస్వరూపాన్ని తెలియజేస్తూ శ్రీపిళ్ళైలోకాచార్యులవారు, " ఈశ్వరస్వరూపం పరత్వ, వ్యూహ, విభవ, అంతర్యామి, అర్చావతారం అని ఐదు ప్రకారాలతో కూడి ఉంటుంది" అనే సూత్రాన్ని అనుగ్రహించారు. దీనిని వ్యాఖ్యానించే శ్రీవరవరమునులు భగవంతుడు ఈ విధంగా పరత్వం మొదలైన ఐదు ప్రకారాలను కలిగి ఉంటాడు– అనే విషయాన్ని విష్వక్సేనసంహిత తెలుపుతున్నదని పలుకుతూ, ఈ క్రింది ప్రమాణవచనాలను ఆ సంహితనుండి ఉదాహరించారు.

"మమ ప్రకారాః పంచేతి ప్రాహు ర్వేదాంతపారగాః,
పరో వ్యూహశ్చ విభవో నియంతా సర్వదేహినామ్,
అర్చావతార శ్చ తథా దయాళుః పురుషాకృతిః,
ఇత్యేవం పంచథా ప్రాహుః మాం వేదాంతవిదో జనాః"

(నా ప్రకారాలు ఐదు విధాలుగా ఉంటాయి– అని వేదాంతంలో అంతును చూచినవారు చెబుతున్నారు. వేదాంతలను తెలిసిన పెద్దలు పరం, వ్యూహం, విభవం, అందరి హృదయాలలో నివసిస్తూ, వారిని నియమించే అంతర్యామి, ఆ

విధంగానే, మిక్కిలి కరుణ కలిగిన, పురుషరూపాన్ని కలిగిన అర్చావతారం –అని ఈ విధంగా ఐదు విధాలైన ప్రకారాలను నేను కలిగి ఉంటానని చెబుతున్నారు)

పరమైకాంతులయిన ప్రపన్నులు భగవంతుడే ఉపాయమని, ఉపేయమని విశ్వసించేవారై ఉంటారు. ఆ విధమైన నమ్మికను కలిగినవారు మాత్రమే ప్రపన్నులని చెప్పదగినవారు, మిగిలినవారు కారు. ఇటువంటి ప్రపన్నులు అన్యదేవతలను ఉపాసించవచ్చునా? అనేది ఒక ప్రశ్న.

ముందుగా చెప్పవలసి వస్తే, పరమైకాంతులైనవారికి ఉపాసన అనేది లేనేలేదు. ఎందుకంటే, వారు భగవంతుని తప్ప, ఇక దేనిని ఉపాయంగా భావించేవారు కాదు కనుక.

"విదుః కృష్ణం బ్రాహ్మణాః తత్త్వతోయే
తేషాం రాజన్! సర్వయజ్ఞాః సమాప్తాః"

(శ్రీకృష్ణుని యథార్థంగా, అంటే, ఉపాయంగా, ఉపేయంగా ఎవరు తెలుసుకుంటారో వారు అన్ని యజ్ఞాలను పూర్తిచేసినవారే అవుతున్నారు) అనే ప్రమాణం దీనిని తెలియజేస్తున్నది.

పరమైకాంతులయిన ప్రపన్నులు దేవదాంతరోపాసనం చేయవచ్చునా?? అనే ప్రశ్నకు సంబంధించిన ఒకానొక ఐతిహ్యం నంబిళ్ళై అనే పూర్వాచార్యుల చరిత్రలో గోచరిస్తుంది.ఒకానొక సందర్భంలో ఒకరు నంబిళ్ళై దగ్గరకు వచ్చి, " మీరు యజ్ఞయాగాదులను చేసేటప్పుడు అగ్ని వరుణ ఇంద్రాది దేవతలను ఆవాహన చేసి ఆరాధిస్తున్నారే! మరి, అటువంటిప్పుడు, దేవతాంతరారాధనను ఎందుకు మీరు చేయమని అంటున్నారు? మీకు ఈ విధంగా దేవతాంతరాలపైన తగని ద్వేషం ఎందుకు?" అని అడిగాడట. అప్పుడు అతనిని చూచి ఆఆచార్యులు " సరే, నీ ప్రశ్న బాగున్నది. ముందు నేనొక ప్రశ్న అడుగుతాను, సమాధానం చెప్పు. మీరు అందరూ

అగ్నిని ఆరాధిస్తారు కదా! మరి స్మశానంలో ఉండే అగ్నినికూడా ఆరాధిస్తారా?" అని అడిగారు. దానికి అతడు "లేదు, మేము స్మశానాగ్నిని ఆరాధించము" అని అన్నారు. అప్పుడు నంబిళ్ళై " ఏమి? ఎందుకు ఆరాధించరు? అది కూడా అగ్నియే కదా!" అని మళ్ళీ ప్రశ్నించారు. అప్పుడు అతడు " మిగిలిన అగ్నులకు, స్మశానంలో ఉండే అగ్నికి తేడా ఉన్నది కదా. అందువల్ల మేము దానిని ఆరాధించము. స్మశానాగ్నికి ఆరాధనార్హత లేదుకదా" అని అన్నాడు వెంటనే నంబిళ్ళైకూడా "నేను కూడా అదే చెబుతున్నాను. భగవంతుడైన శ్రీమన్నారాయణునకు, మిగిలిన దేవతలకు మధ్య అటువంటి తేడాయే ఉన్నది. అగ్ని, ఇంద్రుడు మొదలైన దేవతాంతరాలు అంటే ఎవరు? ఆయా కార్యాలను నిర్వహించడం కోసం భగవంతుడు అహంకారయుక్తులైన ఆయా జీవులను అధిష్ఠించి ఉంటాడు. వారే దేవతాంతరాలు. అటువంటివారు ముముక్షువులకు ఆశ్రయించదగినవారు కారు. అందువల్లనే దేవతాంతరాలను మేము ఆరాధించము." అనే సమాధానాన్ని చెప్పి, అతని నోరును మూయించారు.

ప్రపన్నులు దేవతాంతరోపాసనను చేయకపోవడమే కాదు, భగవంతుని గౌణావతారాలు, ఆవేశావతారాలు కూడా వారికి ఉపాస్యాలు కావు– అనే విషయాన్ని తెలియజేస్తూ, తత్త్వత్రయగ్రంథంలో శ్రీపిళ్లైలోకాచార్యులవారు ఈశ్వర ప్రకరణంలోని 52వ సూత్రంలో " విధి శివపావక వ్యాస జామదగ్న్యార్జున విత్తేశాదులనే భగవానుని గౌణప్రాదుర్భావాలు అన్నీ అహంకారయుక్తులైన జీవులను అధిష్ఠించి ఉండడంచేత ముముక్షువులకు ఉపాస్యాలు కావు" అని తెలియజేశారు.

ఈ సూక్తిని శ్రీవరవరమునులు చాలా వివరంగా వ్యాఖ్యానిస్తూ, విష్వక్సేనసంహితలోనుండి కొన్ని ప్రమాణవాక్యాలను ఉదాహరించి, గౌణావతారాలు

ప్రపన్నునకు ఉపాసించదగినవి కావు– అని నిరూపించారు. ఆ ప్రమాణ వచనాలు ఈ విధంగా ఉన్నాయి.

“అనర్చ్యానపి వృక్ష్యామి ప్రాదుర్భావాన్ యథాక్రమమ్,
చతుర్ముఖ స్తు భగవాన్ సృష్టికార్యే నియోజితః,
శంకరాఖ్యో మహారుద్రః సంహారే వినియోజితః,
మోహనాఖ్యః తథా బుద్ధః వ్యాస శ్చైవ మహానృషిః,
వేదానాం వ్యసనే తత్ర దేవేన వినియోజితః,
అర్జునో ధన్వినాం శ్రేష్ఠో జామదగ్న్యో మహానృషిః,
వసూనాం పావక శ్చాపి విత్తేశ శ్చ తథైవ చ,
ఏవమాద్యా స్తు సేనేశ! ప్రాదుర్భావై రధిష్ఠితాః,
జీవాత్మానః సర్వ ఏతే నోపాస్తిః వైష్ణవీ హి సా,
ఆవిష్టమాత్రా స్తే సర్వే కార్యార్థ మమితద్యుతే,
అనర్చ్యా స్సర్వ ఏవైతే విరుద్ధత్వాన్మహామతే!,
అహంకృతియుతా శ్చేమే జీవమిశ్రా హ్యధిష్ఠితాః”

(ఆరాధించదగనివి అయిన తన అవతారాలనుగూర్చి ఇక్కడ భగవంతుడు క్రమంగా చెబుతున్నాడు. సృష్టికార్యంకోసం నియోగింపబడిన బ్రహ్మ, లయాన్ని చేయడం కోసం నియోగింపబడిన శివుడు, మోహనుడు అనే పేరు కలిగిన బుద్ధుడు, వేదాలను వర్గీకరించే కార్యంలో నియోగింపబడిన మహాముని అయిన వ్యాసుడు, విల్లు ప్రయోగించడంలో చాలా సమర్థుడైన కార్తవీర్యార్జునుడు, జమదగ్ని కుమారుడైన పరశురాముడు, వసువులలో అగ్ని, కుబేరుడు అనే వీరు అందరూ ఆవేశావతారాలచేత అధిష్ఠింపబడినవారు. సేనాధిపతీ! వీరు అందరూ జీవాత్మలు. విష్ణువు అయిన నాచే వ్యాపింపబడిన వీరిని ఆరాధించకూడదు. అధికమైన తేజస్సును కలవాడా! వీరు ఒక కార్యం కోసం నా చేత ఆవేశింపబడ్డారు. గొప్ప జ్ఞానం

కలిగినవాడా! అహంకారంతో కూడి ఉండే వీరు సంప్రదాయానికి విరోధమై ఉన్నందువల్ల, ఆరాధించదగినవారు కాదు)

ఇంతటితో ఆగకుండా, పాంచరాత్రానికి సంబంధించిన సంహితాతరంలో కూడా ఈ విషయం ప్రమాణీకరింపబడిందని అంటూ, ఈ క్రింది శ్లోకాలను వారు ఉదాహరించారు.

"బ్రహ్మారుద్రార్జునవ్యాస సహస్రకరభార్గవాః,
కకుత్స్థాత్రేయ కపిలబుద్ధాద్యా యే సహస్రశః,
శక్త్యావేశావతారా స్తు విష్ణోః తత్కాలవిగ్రహాః,
అనుపాస్యా ముముక్షూనాం యథేంద్రాగ్న్యాదిదేవతాః"

(బ్రహ్మ, శివుడు, కార్తవీర్యార్జునుడు, వ్యాసుడు, సూర్యుడు, పరశురాముడు అనే వీరు, కకుత్స్థుడు, ఆత్రేయుడు, కపిలుడు, బుద్ధుడు అనే వీరు, ఇంకా విశేషశక్తిని కలిగిన పలువురు ఒక కార్యంకోసం ఆయా కాలాలలో మాత్రం విష్ణువుయొక్క శక్తిచేత ఆవేశింపబడినవారు. వీరు– ఇంద్రుడు, అగ్ని మొదలైన దేవతలవలె మోక్షంలో ఇచ్ఛగలిగిన పరమైకాంతులచేత ఆరాధించదగినవారు కారు.)

భగవంతని ముఖ్యమైన విభవరూపాలు ఒకే విధంగా పాంచరాత్రశాస్త్రాలలో చెప్పబడ్డాయా? అనేది ఒక ప్రశ్న. ఈ విషయంలో రెండు విధాలయిన నిర్వాహాలు ఉన్నట్లు తోస్తున్నది– అని శ్రీవరవరమునులు తెలియజేస్తూ, ఈ రెండిటి మధ్య సమన్వయాన్ని కూడా చూపించారు.

ఈశ్వరప్రకరణంలోని 53వ సూత్రంలో శ్రీపిళ్ళైలోకాచార్యులవారు ప్రస్తావించిన షట్త్రింశత్ భేదభిన్నమైన పద్మనాభాది విభవరూపాలనుగూర్చి వివరిస్తూ,

"విభవాః పద్మనాభాద్యాః త్రింశశ్చ నవ చైవ హి,
పద్మనాభో ధ్రువోనంతః శక్త్యాత్మా మధుసూదనః–––"

అని మొదలుగా ఉండే అహిర్బుధ్న్యసంహితా వచనాలలో భగవంతుని పద్మనాభాది విభవరూపాలు 39 గా చెప్పబడినప్పటికీ, ఇక్కడ పిళ్లైలోకాచార్యులవారు వాటిని 36 గా చెప్పడానికి కారణం విష్వక్సేన సంహితలో ఆ విధంగా చెప్పబడడమేనని, అందువల్ల ఇక్కడ ఏ విధమైన శాస్త్రవిరోధం లేదని, అహిర్బుధ్న్యసంహితలో ప్రస్తావింపబడిన మూడిటిని ఈ 36 లో అంతర్భవించుకున్నప్పుడు ఈ సంఖ్య సరిపోతుందని, ఆ మూడు అవతారాలు ఏవి? అంటే, కపిల దత్తాత్రేయ పరశురామరూపాలైన ఆవేశావతారాలని విశదీకరించి, ఇక్కడ ఆపాతతః పాంచరాత్రశాస్త్రంలో వేరు వేరు సంహితలలో ఉండే వాక్యాల మధ్య తోచే వైరుధ్యానికికూడా చక్కని సమాధానం చెప్పారు. ఇక్కడ అభిజ్ఞులైన శ్రీపిళ్ళైలోకాచార్యులవారు విష్వక్సేనసంహితకు అనుగుణంగా సూత్రాన్ని అనుగ్రహించినందువల్ల, విష్వక్సేనసంహితావచనాలకు అనుగుణంగా అహిర్బుధ్న్యసంహితా వచనాలను సమన్వయించుకోవాలనికూడా సూచించారు. వాసుదేవపుణ్యాహవచనాది ఆగమప్రక్రియలలో ఈ 36 విభవమూర్తులకే ప్రాధాన్యాన్ని ఇవ్వడంకూడా ఇక్కడ గమనించదగినది. ఇంతేకాక, విష్వక్సేనసంహిత సాక్షాత్తు భగవానునిచేత విష్వక్సేనునకు ఉపదేశింపబడినది కాగా, అహిర్బుధ్న్యసంహిత రుద్రముఖంగా ప్రవర్తింప జేయబడినది. అందువల్ల విష్వక్సేన సంహిత కు గల ప్రామాణ్యం ఎక్కువ– అని భావించాలి. పురాణాలు అన్నీ ప్రమాణాలు అయినప్పటికీ, వాటిలో కొన్ని పురాణాలు పూర్తిగా ప్రామాణికాలుగాను, మరికొన్ని పాక్షికంగా ప్రమాణాలుగాను చెప్పబడ్డాయి కదా. ఆ క్రమాన్నే ఇక్కడ కూడా భావించాలి.

ఈ సందర్భంలోనే ఇంకొక అద్భుతమైన విషయాన్ని శ్రీమణవాళ మహామునులు తమ వ్యాఖ్యానంలో తెలియజేశారు. ప్రపన్నులు తమ శరీరాలలోని ఆయా స్థానాలలో ద్వాదశోర్ధ్వపుండ్రాలను ధరించి, నిత్యానుష్ఠానాన్ని చేసుకోవడం శాస్త్రసిద్ధం. సంప్రదాయసిద్ధం కూడా. "నెఱ్ఱియుళ్ నిన్ఱు ఎన్నైయాళుమ్ నిఱైమలర్ పాదంగళ్ శూడి" (తిరువాయ్ మొழி–1–9–10) (ఫాలభాగంలో అమరి ఉండి, నన్ను పాలించే, పూలవలె అందమైన నీ చరణాలను తలదాల్చి) అని ఆళ్వారులు కూడా దీనిని ప్రస్తావించారు. ఈ క్రమం పాంచరాత్రాగమ ప్రోక్తానుసారంగా అనుష్ఠింపబడుతున్న వైనాన్ని శ్రీవరవరమునులు ఇక్కడ ఈ క్రింది విష్వక్సేనసంహితా వచనాలను ఉదాహరిస్తూ తెలియజేశారు.

"ఏతదంతర్గతా స్సర్వే మూర్త్యంతర సమాహ్వాయాః,
కేశవాద్యా ద్వాదశ చ లలాటాదిషు నిష్ఠితాః,
శరీర రక్షకా స్సర్వే ధ్యాయినాం తాపశాంతయే"

(వ్యూహమూర్తులు అనే పేరు కలిగిన, కేశవుడు మొదలుకొని దామోదరుడు వరకు ఉండే 12 పేర్లను కలిగి, లలాటం మొదలుకొని పృష్ఠభాగం వరకు 12 చోట్ల ఉండే అన్ని మూర్తులు వ్యూహానికి చెందినవివారు. శరీరాన్ని రక్షించేవారై, ధ్యానం చేసేవారి తాపాన్ని పోగొట్టడం కోసం వారు ఉన్నారు) అని మొదలైన వచనాలను వారు ప్రమాణీకరించి. లలాటం మొదలైన ప్రదేశాలలో నిలచి ఉండి, శరీర రక్షణాన్ని చేస్తూ, ధ్యానించేవారి తాపశాంతి కోసం ఉండేవారు– అని అన్నారు.

అందువల్ల, ఆచార్యుడు శిష్యునకు పంచసంస్కారాలను చేసేటప్పుడు, శిష్యుని శరీరంలోని ఆ యా స్థానాలలో ఊర్ధ్వపుండ్రాలను ధరింపజేసి, వాటిలో ఈ

12 మంది వ్యూహమూర్తులను ప్రతిష్ఠించి, శిష్యునకు రక్షణ కల్పించడం అనే ఈ ప్రపన్నానుష్ఠానం పాంచరాత్రాగమ మూలకమని తెలుస్తున్నది.

ఈ విధంగా శ్రీవరవరమునులు పాంచరాత్రాగమ సూక్తులను పలు సందర్భాలలో పరమ ప్రమాణాలుగా ఉదాహరించిన రీతి చాలా విలక్షణమైనది, విశదమైనది కూడా. ఇక్కడ కేవలం సంగ్రహంగా కొన్నిటిని మాత్రమే ప్రస్తావించడం జరిగింది. మిగిలిన ఇంకా చాలా విశేషాలను వారి గ్రంథాలను పూర్తిగా మనం పర్యాలోచన చేసినప్పుడు స్పష్టం కాగలవు. స్వస్తి.

శ్రీమతే రమ్యజామాతృమునీంద్రాయ మహాత్మనే,
శ్రీరంగవాసినే భూయాత్ నిత్యశ్రీః నిత్య మంగళమ్.

★★★★★

# చక్రీ– రథాంగపాణిః

శ్రీవిష్ణుసహస్రనామ స్తోత్రం మహాభారతాంతర్గతమైనది.. భీష్మాచార్యునిచే లోకానికి ఉపదేశింపబడినది. ఇంకా కొన్ని విష్ణు సహస్రనామ స్తోత్రాలు పురాణాంతరాలలో ఉన్నప్పటికీ, మహాభారతంలోని విష్ణు సహస్రనామ స్తోత్రానకి కల ప్రాధాన్యం, ప్రాచుర్యం ఇంకొక స్తోత్రానికి లేదు –అనేది నిశ్చయం. ఇది మహాప్రభావాన్ని కలిగినది– అని పెద్దలందరి నిర్ణయం, పలువురి అనుభవం కూడా. ఈ స్తోత్రానికి పలు వైదిక సంప్రదాయాలకు చెందిన పలువురు మహనీయులు వ్యాఖ్యానాలను చేశారు. అద్వైత సంప్రదాయానుగుణంగా శ్రీశంకరాచార్యులవారు, ద్వైత సంప్రదాయానుగుణంగా ఆనందతీర్థులవారు దీనిని వ్యాఖ్యానించగా, విశిష్టాద్వైత సిద్ధాంతానుగుణంగా శ్రీపరాశర భట్టర్ వారు భగవద్గుణ దర్పణం అనే పేరును కలిగిన, చాలా అందమైన వ్యాఖ్యానాన్ని అనుగ్రహించారు. అందులో, శ్రీవిష్ణుసహస్రనామ స్తోత్రంలోని నామాలు అన్నీ భగవంతుడైన శ్రీమన్నారాయణుని స్వరూపరూప గుణ విభూతి లీలాది విశేషాలను తెలియజేస్తున్నవి– అని సప్రమాణంగా నిరూపించారు. అంతేకాక, పలు సందర్భాలలో పునరుక్తి అనే దోషం ఉన్నట్లుగా తోచే పలు నామాలలో అటువంటి దోషం ఏమీ లేదనే విషయాన్ని నిరూపించారు. ఆ విధమైన ఒక సందర్భాన్ని గమనిద్దాం.

శ్రీవిష్ణుసహస్రనామ స్తోత్రంలో 108 శ్లోకాలు ఉన్నాయి. వాటిలో సరిగా భగవంతుని వేయి నామాలు కూర్చబడి ఉన్నాయి. ఆ స్తోత్రంలోని చివరి శ్లోకం ఈ విధంగా ఉన్నది.

"శంఖభృన్నందకీ చక్రీ శార్ ఙ్గధన్వా గదాధరః,
రథాంగపాణి రక్షోభ్యః సర్వప్రహరణాయుధః"

## చక్రీ– రథాంగపాణిః

ఇందులో 8 నామాలు ఉన్నాయి. ఇవి అన్నీ భగవంతుడు భక్తరక్షణ కోసం శంఖచక్రాది దివ్యాయుధాలను ధరించి ఉంటాడని తెలుపుతున్నాయి. ఈ నామాలలో "చక్రీ, రథాంగపాణిః" అనే రెండు నామాలు ఉన్నాయి. "చక్రీ"అంటే, సుదర్శన చక్రాన్ని కలవాడు– అని అర్థం, "రథాంగపాణిః" అంటే, సుదర్శన చక్రాన్ని చేతిలో కలవాడని అర్థం. ఈ విధంగా ఈ రెండు నామాలు "భగవంతుడు చక్రాయుధాన్ని ధరించి ఉంటాడు" అనే ఒకే అర్థాన్ని ఇస్తున్నట్లుగా కనబడుతున్నందున, "చెప్పిన విషయాన్నే చెప్పడం" అనే పునరుక్తి దోషం ఈ సందర్భంలో ఉన్నట్లుగా పైపైన చూసినప్పుడు మనకు తోస్తుంది. కానీ, అటువంటి దోషం ఏదీ ఇక్కడ లేదనే వాస్తవాన్ని శ్రీపరాశర భట్టర్ తమ వ్యాఖ్యానంలో విశదం చేశారు. వారి సూక్తులను నిశితంగా గమనిస్తే, ఈ విషయాన్ని గ్రహించవచ్చు.

"చక్రీ"అనే నామానికి వారు" నిత్యసుదర్శనః. స్వభృత్యసుర ప్రతిభట రక్షో ఽ సురశోణిత కల్మాషితజ్వాలాంచితం చక్రమపి తథవేతి" అనే వివరణను ఇచ్చారు. దీని తాత్పర్యం ఏమంటే –భగవంతుడు ఎల్లప్పుడూ చక్రాయుధాన్ని ధరించి ఉంటాడు –అని. ఈ చక్రాయుధానికి సుదర్శనం అని పేరు. ఇది చాలా భయంకరమైనదే కాక, భగవంతుని హస్తంలో ఒక అలంకారం వలె ఉండి, దానికి శోభను కలిగిస్తూ, భక్తుల నేత్రాలకు ఆనందాన్ని కలిగిస్తుంది. భగవంతుడు, తనను సేవించే దేవతలకు శత్రువులైన రాక్షసుల, అసురుల శరీరాలను ఈ సుదర్శన చక్రాన్ని ప్రయోగించి ఖండించడం వల్ల, వారి ఎర్రని రక్తం దీనికి అంటుకొని ఉంటుంది. తన సహజమైన తేజస్సుతోను,చాలా తాపాన్ని కలిగించే అగ్నిజ్వాలతోను ఈ సుదర్శన చక్రం వ్యాపించి ఉంటుంది అటువంటి సుదర్శన చక్రాన్ని నిత్యం ధరించినవాడు, భగవానుడు– అని ఈ నామానికి అర్థం" అనేది పై సూక్తులలోని తాత్పర్యం.

ఇక, "రథాంగపాణిః" అనే రెండవ నామానికి వివరణను అనుగ్రహిస్తూ భట్టర్ వారు "యథోచితం రథాంగం చ పాణా వస్యేతి రథాంగపాణిః. చక్రీత్యనేన

స్వస్వామిసంబంధః ఉక్తః, అత్ర సదోద్యతత్వమిత్యపునరుక్తిః" అనే సూక్తిని అనుగ్రహించారు.రథాంగం అంటే, రథం యొక్క అంగం అయిన చక్రం, అంటే, సుదర్శనం.దానిని తన హస్తంలో ధరించినవాడు కనుక భగవంతుడు "రథాంగపాణిః" అని చెప్పబడుతున్నాడు ఇంతకు ముందు పఠింపబడిన "చక్రీ" అనే నామం కూడా "చక్రాయుధాన్ని కలవాడు" అనే అర్థాన్ని చెబుతున్నప్పటికీ, ఆ ఆయుధానికి ఈయన స్వామి– అని మాత్రమే అక్కడ చెప్పబడింది. ఇక్కడ, నిరంతరం ఈ ఆయుధం భగవంతుని చేతిలో శత్రువులను వధించడంకోసం సిద్ధంగా ఉండే స్థితి తెలుపబడింది కనుక,పునరుక్తి అనే దోషం లేదు– అనేది ఈ సూక్తిలోని తాత్పర్యం.

అందువల్ల భగవంతుడు తన చేతిలో సుదర్శన చక్రాయుధాన్ని ధరించి ఉండే స్థితిని "చక్రీ" అనే నామం తెలుపగా, ఆ ఆయుధాన్ని భగవంతుడు ఎల్లప్పుడూ భక్తుల రక్షణ కోసం ఉపయోగించడానికి సిద్ధంగా ఉండే సన్నివేశాన్ని "రథాంగపాణిః" అనే నామం తెలుపుతున్నదని ఏర్పడుతున్నది. చక్రాయుధాన్ని కలిగి ఉన్నంత మాత్రంలో చాలాదు కదా. దానిని భక్త రక్షణకోసం ఉపయోగించినప్పుడు కదా, అది ఉన్నందుకు తగిన ప్రయోజనం సిద్ధిస్తుంది. చక్రాన్ని చేతిలో కలిగి ఉండే సన్నివేశం ఒకటి, దానిని భక్త రక్షణ కోసం ఉపయోగించడానికి ఎల్లప్పుడూ సిద్ధంగా ఉండే సన్నివేశం ఇంకొకటి. ఈ రెండు ఈ రెండు నామాల ద్వారా తెలుపబడినవి.

కొన్ని దివ్యదేశాలలో స్వామిని మనం దర్శించినప్పుడు, స్వామి ప్రయోగ చక్రాన్ని ధరించి ఉండే సన్నివేశం గోచరిస్తుంది. ఆ సన్నివేశం ఏ విధంగా ఉంటుందంటే, మామూలుగా చక్రాన్ని ధరించి ఉండే స్థితిలో మనకు కనిపించదు. చక్రాన్ని, వెనుకకు తిప్పి శత్రువులపై ప్రయోగించటానికి సిద్ధంగా ఉండే స్థితిలో స్వామి దానిని ధరించి ఉంటాడు.

భగవంతుడు దివ్యాయుధాలను ధరించి ఉండే సన్నివేశాన్ని చూస్తే మనకు ఒక తృప్తి కలుగుతుంది. మనకు ఏ విధమైన విరోధులు ఏర్పడినా, వాటిని

తొలగించటానికి స్వామి తగిన ఆయుధాలను ధరించి ఉన్నాడు కదా. వాటితో మనలను రక్షిస్తాడు – అనే ఒక ధైర్యం కలుగుతుంది. అయితే, నిజంగానే ఆటంకాలు ఏర్పడినప్పుడు, భక్త రక్షణసంభ్రమంతో వాటిని ప్రయోగించే స్వభావం భగవంతునకు ఉన్నది– అని కూడా తెలిస్తే, మన మనసులో కలిగే భీతి పూర్తిగా తీరిపోతుందికదా. మన రక్షణ కోసం మనం సెక్యూరిటీ సిబ్బందిని పెట్టుకున్నంత మాత్రంలో చాలదు కదా. ఆవశ్యకమైనప్పుడు ఆ సిబ్బంది ఉపయోగపడితే కదా, అది ఉన్నందుకు తగిన ప్రయోజనం సిద్ధిస్తుంది. దీనిని అంతటిని భగవంతుడు కలిగి ఉండడం భక్తుల క్షేమం కోసం, ధైర్యం కోసం, నమ్మకం కోసం.

భగవంతుడు ఈ విధంగా చక్రాన్ని రెండు విధాలయిన సన్నివేశాలలో ధరించి ఉంటాడు –అనే విషయాన్ని శ్రీవిష్ణుసహస్రనామ స్తోత్రం తెలిపినట్లుగానే, ఆళ్వారులు తమ దివ్యప్రబంధాలలో కూడా ఈ రస్యమైన అంశాన్ని అనుసంధించారు. వైదికాగ్రేసరులుకదా, ఆళ్వార్లు.

పూదత్తాళ్వారులు మూడవ తిరువందాది దివ్యప్రబంధంలోని 99వ పాశురంలో ఈ అంశాన్ని అనుభవించిన వైనాన్ని మనం దర్శించవచ్చు. ఆ పాశురం ఈ విధంగా ఉన్నది.

తొట్ట పడై ఎట్టుమ్ తోలాద వెన్రియాన్
అట్టపుయకరత్తాన్ అన్నాన్ఱు–తుట్టత్తు
క్కోళ్ ముదలై తుంజ కుఱిత్తెఱింద శక్కరత్తాన్
తాళ్ ముదలే నంగళ్ క్కు చ్చార్ వు.

తన హస్తంలో ధరించిన ఎనిమిది ఆయుధాలతో ఏనాడు ఓడనివాడై, ఎల్లప్పుడూ జయశీలుడై ఉండేవాడై, అష్టభుజ దివ్య క్షేత్రంలో వేంచేసి ఉన్నవాడై, ఆనాడు మడుగులో ఉండే బలిష్టమైన మొసలి నశించేటట్లుగా గురిచూచి విసరిన చక్రాయుధాన్ని కలవాడైన స్వామియొక్క శ్రీపాదమూలమే మనకు ప్రాప్యం.

ఈ పాశురంలో కాంచీపురం దివ్యదేశంలో ఉండే అష్టభుజదివ్యక్షేత్రంలోని స్వామి కీర్తింపబడుతున్నాడు. ఆ స్వామి "తొట్ట పడై ఎట్టుమ్ తోలాద వెన్డియాన్" – తన ఎనిమిది బాహువులలోను ఎనిమిది దివ్యాయుధాలను ధరించినవాడు, అందులో చక్రాయుధం ఒకటి. అతడు ఏనాడు అపజయం ఎరుగని జయశీలుడు. ఆ స్వామి ఇంకా ఎటువంటివాడు ?అంటే, "అన్నాన్డు తుట్టత్తు క్కోళ్ ముదలై తుంజ కుఱిత్తెఱింద శక్కరత్తాన్" పూర్వం మడుగులో ఉండే చాలా బలాన్ని కలిగిన మొసలి నశించేటట్టుగా గురిపెట్టి ప్రయోగించిన చక్రాయుధాన్ని కలవాడు.

గజేంద్రుని కాలును పూర్వం మొసలి పట్టుకోగా, ఆ మొసలికంఠాన్ని భగవానుడు వేగంగా వచ్చి, తన చేతిలోని చక్రాయుధాన్ని ప్రయోగించి, ఖండించిన చరిత్ర పురాణ ప్రసిద్ధం.

శ్రీవిష్ణుసహస్రనామ స్తోత్రంలోని "చక్రీ, రథాంగపాణిః" అనే నామాల ద్వారా అనుసంధింపబడిన సన్నివేశాలు రెండు, ఈ పాశురంలో ఆళ్వారులు ప్రయోగించిన "తొట్ట పడై ఎట్టుమ్ తోలాద వెన్డియాన్, ముదలై తుంజ కుఱిత్తెఱింద శక్కరత్తాన్" అనే రెండు నామాల ద్వారా తెలియజేయబడ్డాయి.

భగవంతుడు భక్తరక్షణ కోసం చక్రాయుధాన్ని తన చేతిలో ధరించి ఉంటాడు – అనే విషయాన్ని "తొట్ట పడై ఎట్టుమ్ తోలాద వెన్డియాన్" అనే ప్రయోగం తెలుపుతున్నది. ఈ విధంగా చక్ర ఆయుధాన్ని చేతిలో ధరించి ఉన్నంత మాత్రంతో చాలదు కదా. ఆవశ్యకమైనప్పుడు దానిని ప్రయోగించే స్వభావాన్ని కూడా భగవానుడు కలవాడు– అనే విషయాన్ని "ముదలై తుంజ కుఱిత్తెఱింద శక్కరత్తాన్" అనే ప్రయోగం తెలుపుతున్నది.

అటువంటి శ్రీ సుదర్శన చక్రాయుధం మనలను ఎల్లప్పుడూ రక్షించాలి.



# తదేకనిర్వాహ్యత్వమ్

పూరువాశారియర్ కళ్ పోద మనుట్టానంగళ్
కూరువార్ వార్ త్తైకళై క్కొండు నీర్ పేశి,
ఇరుళ్ తరుమా ఞాలత్తే ఇన్బముఱ్ఱు వాழ்మ్,
తెరుళ్ తరు మా దేశికనై చ్చేర్ న్దు.

(శ్రీవరవరమునుల ఉపదేశ రత్తినమాలై– 72)

(పూర్వాచార్యుల జ్ఞానాన్నిగూర్చి, వారి అనుష్ఠాన ప్రకారాలనుగూర్చి చెప్పే పెద్దల సూక్తులను పురస్కరించుకొని, వాటికి అనుగుణంగానే మీరు కూడా పలికి, స్పష్టమైన వివేకాన్ని కలిగించే సదాచార్యులను ఆశ్రయించి, అజ్ఞానప్రదమైన ఈ సంసారంలో ఆనందాన్ని పొంది, తరించండి.)

తిరుమంగై ఆళ్వారులు అనుగ్రహించిన పెరియ తిరుమొళి దివ్యప్రబంధవ్యాఖ్యానంలో వ్యాఖ్యాత పెరియవాచ్చాన్ పిళ్లై ప్రస్తావించిన ఒక అద్భుతమైన ఐతిహ్యం ఇది.

నంజీయర్, నంబిళ్ళై కాలంలో అమ్మంగి అమ్మాళ్ అనే ఒక ఆచార్యవర్యులు ఉండేవారు. వారికి చరమదశలో వారి శరీరంలో భరించరాని వేదన కలిగించే వ్యాధి ఏర్పడింది. ఆ వేదన వల్ల వారు చాలా క్లేశాన్ని అనుభవిస్తూ ఉన్నారు. వారు ఎల్లప్పుడూ భగవద్భాగవతాచార్య చింతనలోనే కాలం గడిపేవారు. అనావశ్యకమైన ఏ విషయాన్ని చింతించేవారు కాదు. భగవంతునిపైన ఆచంచలమైన విశ్వాసాన్ని కలవారు. ఎంతటి కష్టం కలిగినా, ధైర్యం ఏమాత్రం కోల్పోనివారు. "మహా విశ్వాసం అనేది మూర్తీభవించినవారు" అని అనదగినవారు. అటువంటి మహానుభావులు వారు. ఏ విషయంలోనూ తమకు ఎంతటి కష్టం కలిగినా, ఎంతటి తీవ్రమైన సమస్య ఏర్పడినా, భగవంతుని విషయంలో కొరతను పలికేవారు కాదు. ఏది సంభవించినా, అది అంతా భగవంతుని అనుగ్రహమే –అనే దృఢమైన భావనను కలిగినవారు. ఆ

విధంగా భగవంతునిపైన సడలని విశ్వాసాన్ని కలిగినవారై ఉన్నప్పటికీ, వారు, చివరి కాలంలో శారీరకంగా చాలా బాధపడవలసి వచ్చింది.

ఒకసారి వీరిని పరామర్శించడం కోసం నంజీయర్ తమ శిష్యులైన నంబిళ్ళైతో కలసి వారి దగ్గరకు వచ్చారు. అమ్మంగి అమ్మాళ్ శరీరంలోని బాధతో చాలా వేదన పడుతున్నట్లుగా వారు చూశారు. అమ్మాళ్ తమ నోటితో తమ బాధను చెప్పకపోయినాప్పటికీ, వారు పడే బాధ ఎంత తీవ్రమైనదో ఆచార్యులు ఇద్దరు తెలిసికొన్నారు. "అంతటి దృఢమైన భక్తి విశ్వాసాలను భగవంతునిపై కలిగిన వీరు ఇంతగా కష్టపడుతున్నారే!" అని వారిద్దరికీ మనస్సులో చాలా బాధ కలిగింది. అందులోనూ, చరమదశలో ఇంత బాధ పడుతున్నారుకదా! అని వారిద్దరూ మనసులో చాలా కొరతపడ్డారు.

నంజీయర్ ఇక ఆగలేక అమ్మాళ్ ను చూసి, "స్వామీ! ఇంతకాలం ఇంత గొప్ప భగవత్కైంకర్యాన్ని చేసిన మీకే ఇటువంటి బాధ కలిగితే, ఇంక సామాన్యుల సంగతి ఏమి? మీరు ఒకసారి భగవంతుని ఉద్దేశించి ప్రార్థించకూడదా? ఒకసారి ప్రార్థిస్తే భగవానుడు మీకు ఈ శ్రమ లేకుండా చేస్తాడు కదా!" అని అన్నారు.

అప్పుడు కూడా అమ్మాళ్ నంజీయర్ ను చూచి భగవంతునిపై ఏ మాత్రం సడలని తమ విశ్వాసాన్ని వ్యక్తం చేస్తూ, తిరుమంగై ఆళ్వారులు అనుగ్రహించిన పెరియ తిరుమొళి ప్రబంధంలోని (3–6–9) పాశురంలో గల "నీ యాళ వళైయాళమాట్టోమే" (నీవు మమ్ములను ఏలుకుంటే, మా గాజులను మేము ఏలుకోలేమా!) అని కదా ఆళ్వారులు అన్నారు. భగవత్ పరిగ్రహమైతే, ఈ విధంగా క్లేశ పడవలసినదే సుమా!" అని అన్నారట.

వీరి ఈ సమాధానాన్ని చూచి నంజీయర్ చాలా ఆశ్చర్యపడ్డారు. "వీరికి ఎంతటి మానసిక పరిపక్వత లేకపోతే, ఈ స్థితిలో కూడా వీరి నోటి నుండి ఇటువంటి సమాధానం వస్తుంది!" అని భావించి, ఆ అభిప్రాయాన్నే తమ శిష్యులైన నంబిళ్ళైతో అన్నారు.

అమ్మంగి అమ్మాళ్ పలికిన సమాధానంలో చాలా గొప్ప అర్థం ఇమిడి ఉన్నది. వారు దీని ద్వారా ఏమి తెలియజేశారంటే, “నేను ఎంతో భక్తితో భగవంతుని సేవిస్తూ ఉన్నాను. ఈ జీవాత్మలన్నీ భగవంతునకు పత్నీస్థానీయులే. భగవంతుడు ఈ జీవులకందరకూ పతి. ఈ అర్థాన్ని తిరుమంత్రంలో మొదట ఉండే ప్రణవంలోని మధ్యమాక్షరమైన ఉకారం తెలియజేస్తూ ఉన్నది. తన భార్య పడే కష్టాన్ని భర్త తెలియలేదంటే, ఆ విషయాన్ని ఊరిలో ఉండేవారికి గాని, లేక, తన భర్తకే కానీ, నేరుగా భార్య చెప్పినట్లయితే, ఆ విధంగా చెప్పడం అనేది ఆ భార్య పతివ్రతా లక్షణానికి ఎంత మాత్రం పొసగదు. ఇది ఒక విషయం. ఇది జీవుని స్వరూపాన్ని బట్టి ఏర్పడినది. ఇక రెండవ విషయం ఏమంటే, తాను పడే బాధను తాను చెప్పిన తరువాతనే దానిని తన భర్త తెలిసికొన్నట్లయితే, అది ఆ భర్తకు అవద్యావహమే అవుతుంది. అంతేకాక, ప్రకృతంలో, సర్వాత్మలకు పతి అయిన భగవంతుడు లోకంలోని సామాన్య స్త్రీల భర్తవంటివాడు కాదు. అతడు సర్వజ్ఞుడు. ప్రపన్నుడు, భగవంతుని సన్నిధిలో తనకు కలిగిన కష్టాన్ని గూర్చి విన్నపించినట్లయితే, అది భగవంతుని సర్వజ్ఞత్వానికి భంగమే కదా. ఈ ఆత్మ అతని శేషం అయినప్పుడు, అతడు దానిని తన ఇష్టప్రకారం వినియోగించుకోనీ! అని కదా భావించి,స్థిరంగా ఉండాలి! “ అనే ఇంతటి గంభీరమైన స్వరూపార్థం అమ్మాళ్ సమాధానంలో ఇమిడి ఉన్నది.

ప్రపన్నుడు భగవంతుని కానీ, ఆచార్యుని కానీ, మహావిశ్వాసపూర్వకంగా శరణాగతి చేయాలని శాస్త్రాలు చెబుతున్నవి. నంజీయర్ నంబిళ్ళైను చూసి, “వారు ఏమంటున్నారో చూశారా? మరణించబోయే ఈ దశలో కూడా ఇటువంటి మాటను చెప్పేటట్టు వీరిని చేస్తున్నది, విశ్వాసంలోని ఘనమైన భావబంధంలో గల ఊనికయే కదా! వీరి మనసులో ఇపుడు “నీ యాళ వళైయాళమాట్టోమే” అనే తిరుమంగై మన్నన్ సూక్తి కదా మెదులుతున్నది!” అని అన్నారు.

తిరుమంగై ఆళ్వారులు అనుగ్రహించిన పెరియ తిరుమొళిలోని ఈ పాశురం ఈ విధంగా ఉన్నది.

నిలైయాళా! నిన్ వణంగ వేణ్డాయే ఆయినుమ్ ★ ఎన్
ములైయాళ ఒరు నాళ్ ఉన్ అగలత్తాల్ ఆళాయే?
శిలైయాళా! మరమ్ ఎయ్ ద తిఱలాళా! ★ తిరుమెయ్య
మలై ఆళా! నీ ఆళ వళై ఆళ మాట్టోమే.

పరకాలనాయకీ భావంతో ఆళ్వారులు అనుగ్రహించిన పాశురం, ఇది. సత్యవ్రతక్షేత్రం అని పిలువబడే తిరుమెయ్యమ్ అనే దివ్యక్షేత్రంలో ఉండే అర్చామూర్తిని ఉద్దేశించి పలికిన సూక్తి, ఇది. ఈ పాశురంలోని చివరి సూక్తిని అమ్మాళ్ ఉట్టంకించారు.

కోదండాన్ని ధరించినవాడా! ఏడు సాలవృక్షాలు కూలేటట్లుగా బాణాన్ని ప్రయోగించిన వీరుడా! తిరుమెయ్యమ్ అనే పర్వతంలో వేంచేసి ఉన్నవాడా! ప్రయోజనాంతరాలను నేను ఆశించకుండా, నిన్నే ఎప్పుడూ నేను ఆశ్రయించేటట్టుగా నీవు నన్ను అనుగ్రహించకపోయినా, నేను కోరేది ఏమంటే, నా స్తనాలను నీవు ఒకనాడైనా, నీకు శేషం అయ్యేటట్లుగా నీ విశాలమైన వక్షస్థలంతో నన్ను ఆలింగనం చేసుకొని, నీకు శేషం చేసికోవాలి. నీవు ఈ విధంగా నన్ను పరిగ్రహించిన తర్వాత, నేను నా గాజులను గూర్చి నేను పరితాపడవలసిన అవసరం లేదు.(భగవంతునకు శేషం తర్వాత దుఃఖం అనేది లేదు) అని దీని భావం.

"నిలకడగా భక్తులను పాలించే స్వభావాన్ని కలవాడా! నీవు నన్ను పాలించను, స్వీకరించను– అని చెప్పినప్పటికీ, కనీసం ఒక్కనాడు అయినా వచ్చి, నీ విశాలమైన వక్షస్సుతో నా వక్షస్సును ఆలింగనం చేసుకోకూడదా! నీవు ఒక అద్భుతమైన వింటిని ధరించి ఉన్నావు నిన్ను ఆశ్రయించిన సుగ్రీవునకు నమ్మకం కలగడం కోసం ఏడు సాలవృక్షాలను కూలగొట్టావు. నీకు సత్యవ్రతుడు అనే పేరు

ఉన్నది కదా. అన్నిటినీ తెలిసిన సర్వజ్ఞుడవు నీవు. అటువంటి నీవు, నాకు కలిగిన క్లేశం తెలియలేదంటే, నిన్ను ఏమని అర్థం చేసుకోవాలి? నీవు ఒక్కసారి నన్ను పరిగ్రహిస్తే చాలు ఇక నేను నా గాజులనుగూర్చి చింతించవలసిన అవసరం లేదే!"– అని పరకాల నాయకి భగవానునితో అంటున్నది.

నాయకుడు నాయకిని పరిగ్రహించినట్లయితే, అప్పుడు నాయకికి కలిగిన సంతోషాతిశయంచేత ఆమె చేయి బలపడుతుంది. అప్పుడు ఆమె తన చేతిలో ధరించిన గాజులు జారిపోకుండా నిలకడగా నిలుస్తాయి. ఆ విధంగా కాకుండా, నాయకుడు ఆమెను ఆదరించకపోతే, అప్పుడు కలిగిన క్లేశం వల్ల ఆమె శరీరం కృశించిపోతుంది కనుక, ఆమె చేయికూడా సన్నబడి, ఆ చేతిలో ధరించిన గాజులు కూడా జారిపోతాయి. అందువల్ల, తన చేతిలో ధరించిన గాజులు జారిపోకుండా ఉండాలంటే, భగవానుడు తనను పరిగ్రహించాలి– అని పరకాల నాయకి ప్రార్థిస్తున్నది. ఈ భావం "నీ ఆళ వళై ఆళ మాట్టోమే" అనే సూక్తిలో ధ్వనిస్తున్నది.

ఈ సూక్తి, ప్రపన్నుడు ఏ విధమైన స్వభావాన్ని కలిగి ఉండాలో తెలుపుతున్నది. "భగవంతుడు నన్నుగూర్చి ఏ విధంగా భావిస్తున్నాడో, ఆ విధంగానే కానీ" అనే నిశ్చయబుద్ధితో అతడు ఉండాలి. తనకు ఏమి ఘటించినా, అది భగవంతుని అనుగ్రహఫలంమే అని భావించాలి " అనే ఈ ప్రపన్నలక్షణాన్ని ఇక్కడ అళ్వార్లు పరకాలనాయకీ భావంతో పలికిన సూక్తి ద్వారా వ్యక్తం చేశారు.

అనన్యార్హశేషత్వం, అనన్య శరణత్వం, అనన్యభోగ్యత్వం, భగవంతుని సంశ్లేషం కలిగి ఉంటేనే సహించి ఉండగలగడం, విశ్లేషాన్ని సహించలేకపోవడం, భగవంతునిచేతనే నిర్వహింపబడడం – అనే ఈ ఆరు లక్ష్మీస్వరూప నిరూపకాలు. జీవులందరూ స్వరూపంలో లక్ష్మీదేవితో పోలి ఉన్నవారే కనుక, ఈ ఆరు లక్షణాలుకూడా వారికి అన్వయిస్తాయి. వాటిలో, భగవంతునిచేతనే

నిర్వహింపబడడం– అనే లక్షణాన్ని తిరుమంగై మన్నన్ పై సూక్తి ద్వారా వ్యక్తం చేశారు.

ఆళ్వారుల సూక్తులలోని తత్త్వాలను, అర్థం చేసికొని, వాటిని తమ ఆచరణలో పెట్టుకున్న మహనీయులు మన పూర్వాచార్యులు. జ్ఞానంతో పాటు, దానికి తగిన అనుష్ఠానాన్ని కూడా పూర్ణంగా కలిగినవారు కదా, వారు. ఈ విషయానికి ఇక్కడ ప్రస్తుతింపబడిన ఐతిహ్యం ఒక ఉదాహరణ. అటువంటి మన పూర్వాచార్యుల ఆచరణలను అన్నిటినీ మనం గ్రహించి, మనంకూడా అనుసరించి, మన జీవితాలను సార్థకం చేసికోవాలి– అనే ఉదారమైన బుద్ధితో దివ్యప్రబంధాలను వ్యాఖ్యానించేటప్పుడు, స్వతంత్రమైన గ్రంథాలను అనుగ్రహించేటప్పుడు మన పూర్వాచార్యులు పలువురు తమకు ముందున్న మహనీయులైన ఆచార్యుల జ్ఞానానుష్ఠానాలను తెలిపే ఎన్నో ఐతిహ్యాలను ప్రస్తుతించారు. వారు ఈ విధంగా ప్రస్తావించి ఉండకపోతే, అవి మన వరకు పరంపరగా అంది ఉండేవి కాదు కదా.

ఈ విధంగా అపూర్వమైన వేదాంతతత్త్వాలను తమ మధురమైన సూక్తుల ద్వారా అనుగ్రహించిన ఆళ్వారులకు, వాటిని గ్రహించి, ఆచరించిన మన పూర్వాచార్యులకు, వారి పరమప్రామాణికాలైన అనుష్ఠానాలను తరతరాలుగా మనమందరం తెలిసికొని, తరించేటట్లుగా తమ గ్రంథాలలో వాటిని మనకు అందజేసిన మహోదారులైన వ్యాఖ్యాతలకు కృతజ్ఞతావిష్కరణను చేసుకొందాం. స్వస్తి.

★★★★★

# కులశేఖర ప్పెరుమాళ్ సూక్తులతో మిగిలిన ఆళ్వార్ల సూక్తుల సామ్యాలు

దివ్యసూరుల దివ్యప్రబంధాలను వ్యాఖ్యానం చేసేటప్పుడు, మన పూర్వాచార్యులు దివ్యప్రబంధ సూక్తులకు, సంస్కృతవేదాంత సూక్తులకు మధ్య ఉండే అర్థసామ్యాలను పలుచోట్ల సప్రమాణంగా నిరూపించారు. ఇది ఒక ఎత్తు అయితే, చాలా సందర్భాలలో తాము వ్యాఖ్యానించే ఆళ్వారుల దివ్యప్రబంధంలోని సూక్తులకు, మిగిలిన ఆళ్వారుల దివ్యప్రబంధాలలో ఉండే సూక్తులకు మధ్య ఉండే అర్థసామ్యాలను కూడా చాలా హృద్యంగా వివరించారు. ఇది ఆళ్వారుల ఐకంకంఠ్యాన్ని నిరూపిస్తుంది. ఇటువంటి అర్థసామ్యాలను దృష్టిలో పెట్టుకొని, కులశేఖరుల సూక్తులకు, మిగిలిన ఆళ్వారుల సూక్తులకు మధ్య ఉండే కొన్ని సామ్యాలను ఇక్కడ ప్రస్తుతించడం జరుగుతున్నది.

## 1) కులశేఖర ప్పెరుమాళ్––పెరియాళ్వార్లు

కులశేఖరాళ్వార్లు "ఊనేఱు శెల్వమ్" (4-9) దశకంలో భగవానుని "తిరుమాలే నెడియానే" అని అంటూ ఆశ్రితుల విషయంలో భగవానుని అవధి లేని పక్షపాతిత్వాన్ని తెలిపారు. ఈ సంబోధనలోని ఆళ్వార్ల ఆంతర్యాన్ని వివరిస్తూ పరమకారుణికులైన పెరియవాచ్చాన్ పిళ్ళై "అవళ్ తానుమ్ –ఎన్నాలుమ్ పొఱుక్కప్పోకాతు– ఎన్నపోతు 'ఎన్నడియార్ అతు శెయ్యార్' (పెరియా-తిరు-4-8-2) ఎన్ఱు ఆశ్రితవిషయత్తిల్ ఓరమ్ ఎల్లై కాణవొణ్ణాతవన్" (లక్ష్మీదేవిసైతం "నావల్లకూడా ఇతని దుష్కర్మలను సహించడానికి సాధ్యం కాదు" అని అన్నపుడు, "నా దాసులు ఆ దోషాన్ని చేయరు" అని పల్కి ఆశ్రితులపట్ల పక్షపాతం అంతు లేకుండా ఉండేవాడు) అనే పెరియాళ్వార్ల శ్రీసూక్తిని ఉదాహరించడం వల్ల,

ఈరెండు సూక్తులలోని భావసామ్యం స్పష్టం. కులశేఖరుల సూక్తిలో ఈ విశేషభావం "తిరుమాలే! నెడియానే!" అనే రెండు సంబోధనల సమాహారంవల్ల స్ఫురిస్తున్నది.

ఇపుడు వీరిద్దరి సూక్తుల మధ్యగల ఇంకొక అద్భుతమైన భావసామ్యం నివేదింపబడుతున్నది.

పెరియాళ్వార్లు "పరుకు నీరుమ్ ఉడుక్కుమ్ కూఱైయుమ్ పావమ్ శెయ్ దన" (4-4-4) అని అంటూ "భగవన్నామానుసంధానాన్ని చేయని మానవులు తాగే నీరు, ధరించే వస్త్రం పాపాన్ని చేశాయి" అని అన్నారు. ఈ సూక్తిని వ్యాఖ్యానించే పెరియ వాచ్చాన్ పిళ్ళై- "వారు తాగే నీరు, ధరించే వస్త్రం పాపాన్ని చేశాయి కదా" అని అంటున్నారు. "అనేన జీవేనాత్మనానుప్రవిశ్య నామరూపే వ్యాకరవాణి" - ఈ జీవునిద్వారా చేతనాచేతనాల్లో అనుప్రవేశించి వాటి నామరూపాలను వ్యాకరిస్తాను - అని వ్యష్టిసృష్టికి ఉన్ముఖుడైన భగవానుని సంకల్పం కనుక, నామరూపాలను కల సకలవస్తువులలో ఒక్కొక్క జీవుడు అధిష్ఠించి ఉన్నాడని గ్రహించాలి. ఘటపటాదిపదార్థాలలో ఒక్కొక్క జీవుడు అధిష్ఠించి ఉన్నాడని ఎందుకు తోచడం లేదు? అని అంటే, ఆ యా జీవుల కర్మానుగుణమైన జ్ఞానసంకోచకారణంచేత తోచడం లేదు. "తయా తిరోహితత్వాచ్చ శక్తిః క్షేత్రజ్ఞసంజ్ఞితా, సర్వభూతేషు భూపాల! తారతమ్యేన వర్తతే, అప్రాణిమత్సు స్వల్పా సా స్థావరే తు తతోఽ ధికా"అని అనబడుతున్నది కదా! అందువల్లనే 'పావమ్ శెయ్ దాన్ కొలో!" అని అనడం. అంటే, ఇది చేసిన పాపంవల్లకదా, వీరికి ఇవి శేషం అయినవి— అని భావం. విలక్షణులైనవారికి శేషమైన పదార్థాలకు ఆ విధంగా శేషం కావడంద్వారా వాటికి ఒక సత్కర్మ ఉన్నదని, హీనులైనవారికి శేషం అయినవాటికి ఏ సత్కర్మ లేనందువల్ల, పూర్వపాపఫలమే ఈ విధంగా అయిందని చెప్పబడుతున్నదికదా! "వేదవిద్యావ్రతస్నాతే శ్రోత్రియే గృహ

మాగతే, క్రీడంన్త్యోషధయ స్సర్వాః యాస్యామః పరమాం గతిమ్" (వేదవిద్యను పూర్తిగా అభ్యసించి, స్నాతకవ్రతాన్ని పూర్తి చేసికొన్న విద్వాంసుడు ఇంటికి వస్తే, ఆ ఇంటిలో ఉండే పదార్థాలన్నీ–" మనం ఇతనికి శేషం కావడంద్వారా పరమపదాన్ని పొందగలం కదా"– అని సంతోషిస్తాయి) అని, "నష్టశౌచే వ్రతభ్రష్టే విప్రే వేదవివర్జితే, దీయమానం రుదత్యసన్నం కిం మయా దుష్కృతం కృతమ్" (శౌచం లేనివాడు, వ్రతభ్రష్టుడు, వేదాన్ని విడచినవాడైన బ్రాహ్మణునికి పెట్టబడ్డ అన్నం "అయ్యో! నేను ఏం పాపం చేశానో కదా!" అని ఏడుస్తుంది) అని శ్రీవిష్ణుధర్మంలో చెప్పబడింది– అని వివరించారు. పాశురంలో నీరు, వస్త్రం చెప్పబడడం మిగిలిన అన్ని వస్తువులకు ఉపలక్షణం.

ఇటువంటి భావాన్నే కులశేఖరులు "తన ముడైత్తు త్తరణితానే" (10-5) (శ్రీవైష్ణవుల సంచారానికి విషయమైన భూమి ఎంతో పుణ్యం చేసింది -) అని అంటూ అనుసంధించారు. ఇవి వీరి సూక్తులలోని కొన్ని సామ్యాలు.

2. కులశేఖరులు – ఆణ్డాళ్

ఆణ్డాళ్ శ్రీవేంకటేశ్వరుని - "వెయ్యదోర్ తழలుమிழ் శక్కరత్తై వేఙ్గడవఙ్కు" అని అంటూ నిప్పులు కక్కే శ్రీసుదర్శనాన్ని ఆయుధంగా కల్గి ఉండడాన్ని వేంకటేశ్వరునకు నిరూపకంగా పల్కిన భావాన్ని కులశేఖరులు కూడా "మిన్ వట్ట చ్చుడరాழி వేఙ్గడక్కోన్" (ప్రకాశించే, గుండ్రని ఆకారంలో గ ఉండే జ్వాలలను కలిగిన సుదర్శనాన్ని ధరించిన శ్రీవేంకటేశ్వరుడు) అని అంటూ అనుసంధించారు.

శ్రీరాముడు అరణ్యానికి వెళ్ళినపుడు, అతని వియోగాన్ని సహించలేక దశరథుడు దుఃఖించే ప్రకారాన్ని తద్భావనతో పల్కుతూ కులశేఖరులు "కాకుత్తా!

కరియకోవే" అని అన్నారు. ఈ రెండు సంబోధనలలో, మొదటి సంబోధనవల్ల "ఇది నీ అభిజాత్యానికి, అంటే,– కకుత్ స్థుని వంశంలో జన్మించినందుకు తగదు" అని, రెండవ సంబోధనలో – "నీ రూపసౌందర్యానికి తగదు" అని సూచించారని పూర్వాచార్యవ్యాఖ్య. ఆణ్డాళ్ గోపికాభావనతో తిరుప్పావై ప్రబంధంలో 19వ పాశురంలో పల్కుతూ నీళాదేవినిగూర్చి "తత్తువమన్ను తకవన్ను" నీ స్వభావానికి తగదు, నీ స్వరూపానికి తగదు) అని అనడంకూడా ఇటువంటిదే.. "మైత్తడమ్ కణ్ణినాయ్" అని ఆమెను సంబోధించిన ఆణ్డాళ్ ఈ రెండు పదాలతో "నీవు శ్రీకృష్ణుని నిరోధించడం నీ స్వరూపానికి తగినది కాదు; నీ పురుషకారరూప స్వభావానికి తగినది కాదు– అని అన్నారు"– అని పూర్వాచార్య వ్యాఖ్య.

3. కులశేఖరులు –తొణ్డరడిప్పొడికళ్

కులశేఖరులు తమ ప్రబంధంలోని 4వ దశకం 9వ పాశురంలో "పడియాయ్ కిడన్దు ఉన్ పవళవాయ్ కాణ్బేనే" (గడపనై పడి ఉండి, పగడం వంటి నీ అధరాన్ని దర్శిస్తాను) అని అన్నారు. ఆళ్వార్లు ముందు అచిద్వత్ పారతంత్ర్యాన్ని ఆశపడి, "పడియాయ్ కిడన్దు" (గడపగా పడి ఉండి) అని అనగానే, శ్రీవేంకటేశ్వరుని మనస్సు ప్రసన్నమై, తన నోరు తెరచి మందహాసం చేశాడు. ఆ సన్నివేశం స్ఫురించేటట్లు ఆళ్వార్లు వెంటనే "ఉన్ పవళవాయ్" అని అన్నారు. ఈ విధంగా ఈ పదం భగవానుని ఆశ్రితవ్యామోహసూచకం.

తొడ్డరడిప్పొడి ఆళ్వార్లు తిరుమాలై ప్రబంధంలోని 35వ పాశురంలో "శెజ్గణ్ మాలే!" అని భగవానుని సంబోధించారు. ఇది స్వభావ కథనం కాదు. తత్కాలీనవిశేషణం. ఆళ్వార్లు దీనికి ముందు "శిక్కెన" (త్వరగా) అని అనగానే, భగవానుని మనస్సు వారిపట్ల ప్రసన్నమయినది. స్వామికి వీరిపట్ల కల్గిన వ్యామోహం

అతని లోపల ఇముడక పోవడంతో, అతని కళ్ళు అనురాగంవల్ల రంజితాలయ్యాయి. ఈ అంశాన్ని ఈ సంబోధన సూచిస్తున్నది– అని పూర్వాచార్య వ్యాఖ్య.

4. కులశేఖరులు – తిరుమంగై మన్నన్

కులశేఖరులు శ్రీకృష్ణావతారంలోని ఉలూఖలదామబంధన సన్నివేశాన్ని అనుభవిస్తూ, "ఎழிల్ కొళ్ తామ్బు" (7-8) (ప్రకాశించే దారం) అని అన్నారు. ఈ సూక్తిని పెరియవాచ్చాన్పిళ్ళై "స్పర్శిక్కైక్కు ఆశైప్పట్టిరుక్కుమ్ తిరుమేనియై స్పర్శిత్తతిఱే– ఎన్ఱు "ఎழிల్ కొళ్ తామ్బు" "ఎన్గిఱార్. రాజజన్మమ్ వేణ్డా, అచేతనమాక అమైయుమ్; అజ్గుత్తై స్పర్శమ్ పెఱిల్– ఎన్ఱిరుక్కుమవరిఱే" (స్పృశించడానికి ఆశపడిన తిరుమేనిని తాకింది కదా!– అనే కారణంతో "ఎழிల్ కొళ్ తాంబు" అని అంటున్నారు " నాకు రాజజన్మ అక్కరలేదు అచేతన జన్మ అయినా చాలు, భగవంతుని స్పర్శను పొందగలిగినట్లయితే"– అని భావించేవారు కదా!– అని వ్యాఖ్యానించారు.

తిరుమఙ్గై మన్నన్ కూడా ఈ వృత్తాంతాన్ని అనుసంధిస్తూ– "ఆయ్ చ్చి ఒణ్ కయిற்றினాల్ ఆర్ క్క" (6-7-4)(యశోదా దేవి అందమైన దారంతో బంధించగా) అని అన్నారు. దీనిని పెరియవాచ్చాన్పిళ్ళై "తిరుమేనియై స్పర్శిక్కప్పెற்றது ఎన్ఱు "ఒణ్ కయిఱు" ఎన్గిఱారాకవుమామ్" (భగవంతుని తిరుమేనిని స్పృశించగలిగింది– అనే కారణంతో "ఒణ్ కయిఱు" అని అంటున్నారని చెప్పవచ్చు" అని వ్యాఖ్యానించారు.

దీనినిబట్టి ఈ రెండు సూక్తుల సామ్యం సుస్పష్టం.

"కణ్డవర్ తమ్ మనమ్ వழுఙ్గుమ్" (పెరియ తిరు-8-1-9),

"కణ్ణవర్ తమ్ మనమ్ వழఙ్గుమ్" (పెరుమాళ్ తిరు –8–2),

"అజ్గోర్ ఆయ్ చ్చి ఎల్లిప్పొழுతాడి" (పెరియ తిరు 10–8–10), "ఆయిచ్చిమార్ కళ్ ఎల్లిప్పొழுదినిల్ ఏమత్తూడు" (పెరుమాళ్. తిరు. 6–10),

"తేవరైయుమ్ అశురయ్రైయుమ్ తిశైకళైయుమ్" (పెరియతిరు–11–6–10),

"తేవరైయుమ్ అశురరైయుమ్ తిశైకళైయుమ్" (పెరుమాళ్ తిరు. 8–10)

ఇత్యాది శబ్దప్రయోగసామ్యాలు కూడా ఉన్నాయి. ఇటువంటి సామ్యాలు వీరిద్దరి సూక్తులలో పదుల కొద్దీ ఉన్నాయి.

5. కులశేఖరులు– నమ్మాழ్వార్లు

ప్రణయకలహసన్నివేశాన్ని నాయికీభావనతో అత్యంతమధురంగా అనుగ్రహించిన వారు వీరిద్దరు. నమ్మాళ్వార్లు "మిన్నిడై మడవార్" (6–2–0) అనే దశకంలోను, కులశేఖరులు "ఏర్ మలర్ పూమ్ కుழల్" అనే 6వ దశకంలోను ఈ అనుభవాన్ని వ్యక్తంచేశారు. వీటిలో పలు సూక్తిసామ్యాలున్నా, ఒక్కటి మాత్రం ఇక్కడ ఉదాహరణగా తెలుపబడు తున్నది.

నమ్మాழ్వార్లు ప్రయణకుపిత అయిన నాయికా భావనతో పల్కుతూ, "పోకు నమ్బీ"అని శ్రీకృష్ణుని ఉద్దేశించి అన్నారు. ఈ సూక్తిలోని తాత్పర్యాన్ని నమ్బిళ్ళై – "పోకు నమ్బీ! ఎన్ఱు మున్బే శొల్లిచ్చెయ్ దే, తిరియవుమ్ శొల్లుమ్బోదు ఒన్ఱిరణ్డడి వరవిట్టు క్కిట్ట నిన్ఱానాక వేణుమిఱే. "వారీర్! ఎత్తనై పేరై తీణ్డి వన్దీరెన్ఱు తెఱియాతు. పుడైవై పడామే కడక్కనిల్లు– మెన్ఱాళ్. "పో" ఎన్న, వర నిఱ్కక్కడవన్ "తీణ్డాతే కొళ్ళుమ్" ఎన్ఱాల్ ఎన్బడుమో! – (పోకు నంబీ! అని ఇంతకు ముందే చెప్పినప్పటికీ, మళ్లీ ఆ మాటనే చెబుతున్నది అంటే, ఒకటి రెండు అడుగులు ముందుకు పెట్టి, సమీపించి ఉండి ఉండాలి కదా ! " ఏమయ్యా నీవు ఎంత మందిని తాకి వచ్చావో తెలియదు. నీ వస్త్రం నాకు తాకకుండా దూరంగా నిలువు– అని అంటున్నది.

పొమ్మన్నప్పటికీ అక్కడే నిలుచున్నవాడు, " నన్ను తాకకు "అంటే, ఏం చేస్తాడో ఏమో కదా!) అనివ్యాఖ్యానించారు.

కులశేఖరులు ప్రణయరోషాన్ని పొందిన గోపికాభావాన్ని ఆరోపించుకొని, "ఎற்றைக்కు నీ ఎన్ మరుజ్గిల్ వన్దాయ్?" (6-6) అని పల్కడంకూడా ఇటువంటిదే. దీనిని పెరియవాచ్చాన్ పిళ్ళై- "ఆరై త్తీణ్డి వన్దాయ్ ఎన్ఱు తెఱియాతు. ఎన్నై తీణ్డాతే, కడక్క నిల్లు" (ఎవరిని తాకి వచ్చావు? అనేది తెలియదు. నన్ను తాకకుండా దూరంగా నిలు) అని వివరించడం దీనికి ప్రమాణం. "తిణ్ క్కழల్" (1-2-10) (బలమైన పాదాలు)అని నమ్మాళ్వార్లు అంటే, ఇదే అర్థంలో"వన్ నాళ్" (9—1) అని కులశేఖరులన్నారు. ఇటువంటి సామ్యాలు ఇంకా చాలా ఉన్నాయి.

6. కులశేఖరులు— మధురకవులు

కులశేఖరులు "తేట్టరుమ్" అనే దశకంలో భాగవతశేషత్వాన్ని వ్యక్తం చేయగా, మధురకవులు తమ ప్రబంధం అంతటా భాగవతశేషత్వాన్ని అనుసంధించారు.

7. కులశేఖరులు – పొయ్ గ ఆళ్వార్లు

భగవత్సంబంధంవల్ల గర్వించిన సముద్రాన్ని గూర్చి "మాలైయుற்ற క్కడల్" అని కులశేఖరులు పలికారు. పొయ్ గై ఆళ్వార్లు ఈ అంశాన్ని "మాలుమ్ కరుమ్ కడలే"(19) అని అనుగ్రహించారు. వీరిద్దరి సూక్తులలో ఇటువంటి భావసామ్యాలు వ్యాఖ్యానాలలో చాలా కనిపిస్తాయి.

8. కులశేఖరులు —పేయాళ్వార్లు

భగవానుని వక్షఃస్థలానికి, తులసీమాలకు కల చేరికలోని అందాన్ని ఈ ఆళ్వార్లు ఇద్దరు అనుభవించిన తీరు అత్యంతం రసఘనం. పేయాళ్వార్లు.

“నెడువరై వాయ్ తారుమ్ అరువిపోల్ తార్” (విశాలమైన పర్వతంలో ప్రవహించే కొండవాగువలె వనమాలిక ప్రకాశించగా) అని అంటూ ఉపమాలంకారప్రయోగ పూర్వకంగా ఈ చేరికను కీర్తించారు. కులశేఖరులు “తుழாయ్ మాలై యుற்ற వరై ప్పెరుమ్ తిరు మార్బు” (2-8) (తులసీమాలను అలంకరించుకున్న పర్వతం వలె విశాలమైన వక్షస్సును కలవాడు) అని ఈ చేరికను పొగడారు. ఈ సూక్తిని వివరిస్తూ పెరియవాచ్చాన్ పిళ్ళై “వణ్డుకళ్ నెరుజ్గి యిరుక్కిఱ శెవ్వి త్తిరుత్తుழாయ్ మాలై శేర్ న్ద మలైపోలే ఇరుక్కిఱ పెరున్దిరుమార్వై ఉడైయవరై. “మైపోల్ నెడువరై వాయ్ త్తాழு మరువిపోల్ తార్ కిడప్ప' ఎన్నక్కడవదిఱే” (తుమ్మెదలు దట్టంగా ఉండే, అందమైన తులసీమాల చేరి ఉండే, పర్వతం వలె ఉన్న గొప్ప వక్షస్సును కలవానిని. ఈ విధంగానే పేయాళ్వార్లు కూడా “మైపోల్ నెడువరైవాయ్ త్తాழு మరువిపోల్ తార్ కిడప్ప– కాటుక పర్వతంపై ప్రవహించే కొండవాగువలె వనమాలిక ఉండగా –అని చెప్పబడుతున్నది కదా) అని పల్కడం వీరిద్దరి సూక్తిసామ్యానికి ఒక తార్కాణం.

ఇటువంటి అందమైన శబ్దార్థసామ్యాలు కులశేఖరాళ్వారుల సూక్తులకు, మిగిలిన ఆళ్వారుల సూక్తులకు మధ్య చాలా ఉన్నాయి. విస్తృతభీతి చేత ఇంతటితో ముగించబడింది.



# ఆళ్వారుల సూక్తులలో భగవద్రామానుజులు

నమ్మాళ్వారులు తిరువాయ్ మొழி దివ్యప్రబంధంలో "పొలిగ పొలిగ పొలిగ, పోయిற்று వల్లుయిర్ శావమ్ ---కలియుమ్ కెడుమ్ కండుకొణ్ మిన్" (5-2-1) (భాగవతసమృద్ధి!, భాగవత సమృద్ధి! భాగవత సమృద్ధి!, చాలా బలమైన ఆత్మల శాపం అంతా నశించింది, కలి నశిస్తున్నది చూడండి) అనే సూక్తిని అనుగ్రహించారు. దీనిని వ్యాఖ్యానిస్తూ మన పూర్వాచార్యులు కలియుగంలో శ్రీరామానుజుల అవతారం జరగబోతున్నదని, దీని ప్రభావంచేత కలివల్ల లోకంలో ఏర్పడిన అజ్ఞానాంధకారం నశించి పోతుందని ఆళ్వారులు జరగబోయే సంగతిని సూచించారు- అని అన్నారు.

నమ్మాళ్వారుల ఈ సూక్తిని దృష్టిలో పెట్టుకొనే పరాశర భట్టర్ శ్రీరంగరాజస్తవం పూర్వశతకం ఆరంభంలో భగవద్రామానుజులను స్తుతిస్తూ "రామానుజమునిః జీయాత్ యో హరేః భక్తియంత్రతః, కలికోలాహలక్రీడా ముధాగ్రహ మపాహరత్" (భక్తి అనే యంత్రంతో కలిపురుషుని కోలాహలం అనే మొండి పిశాచాన్ని దూరంగా తరిమివేసిన భగవద్రామానుజ ముని చిరకాలం వర్ధిల్లాలి) అనే శ్లోకాన్ని రచించారు.

ఈ విధంగా నమ్మాళ్వార్లు తమ ప్రబంధంలో శ్రీరామానుజుల దివ్యవతారాన్ని, దాని ప్రయోజనాన్ని సాధారణంగా సూచించగా, అంతకుముందే ఇంకొక ఆళ్వారులు తమ ప్రబంధంలో శ్రీరామానుజుల అవతారాన్ని సూచిస్తూ, ఆ అవతారంలో తిరుమల కొండపై జరగబోయే ఒక సంఘటనను అలంకారికమైన శైలిలో సూచించారు.

ముదలాళ్వార్లు అని పేరు పొందిన సరోయోగి, భూతయోగి, మహాయోగి అనే ముగ్గురిలో, రెండవవారైన పూదత్తాళ్వారులు అనే భూతయోగి తమ రెండవ తిరువందాది ప్రబంధంలో ఒకచోట, 74వ పాశురంలో శ్రీవేంకటేశ్వరుని ఉద్దేశించి "యానే ఇరుమ్ తమిழ் నన్మాలై ఇణైయడిక్కే శొన్నేన్, పెరుమ్ తమిழనల్లేన్ పెరిదు" (నేనే, లక్షణాలతో పూర్ణంగా ఉండే, ద్రావిడ భాషలో విలక్షణమైన పాశురమాలికను భగవంతుని శ్రీచరణాలు రెండిటిలో పాడి సమర్పించాను. నేనే గొప్ప ద్రావిడపండితుడను, మిక్కిలి గొప్పవాడను అయ్యాను) అని అన్నారు.

తాము గొప్ప ద్రావిడ పండితులమని, తాము చెప్పిన పాశురమాలిక చాలా విలక్షణమైనదని, లక్షణపూర్ణమైనదని పూదత్తాళ్వారులు అనగానే, శ్రీవేంకటేశ్వరుడు వెంటనే "ఆళ్వారులూ! మీరు చాలా గొప్ప ద్రావిడపండితులమని అంటున్నారే! ఆ భాషలో చాలా గొప్పగా పాశురాలను చెప్పగలమని అంటున్నారే! ఆ విధంగా అయితే, ఒక చక్కని ద్రావిడపాశురాన్ని చెప్పండి, వింటాను "అని అన్నాడట. వెంటనే పూదత్తాళ్వార్లు ఈ క్రింది పాశురాన్ని చెప్పారు.

"పెరుగు మదవేழమ్ మాప్పిడిక్కు మున్నిన్ఱు
ఇరుకణ్ ఇళమూంగిల్ వాంగి–అరుకిరుంద
తేన్ కలందు నీట్టుమ్ తిరువేంగడమ్ కండీర్,
వాన్ కలంద వణ్ణన్ వరై."

గొప్ప ఆడ ఏనుగుకు ఎదురుగా నిలచి, రెండు కణుపులను కల లేత వెదురును విరచి, దగ్గరలో ఉండే తేనెలో దానిని ముంచి, తొండంతో దానిని చాచి, ఆడ ఏనుగుకు ప్రేమగా ఇచ్చే, మదజలం కారే మగ ఏనుగులు కలిగిన గొప్ప వేంకటాచలమే కదా, మేఘసమానవర్ణుడైన శ్రీనివాసభగవానుడు నివాసం చేసే కొండ.

ఈ పాశురంలో, తిరుమల కొండపై గోచరించే, సహజసిద్ధమైన రామణీయకాన్ని స్వభావోక్తి పురస్సరంగా అందంగా వర్ణించే కవితా సౌందర్యం ఒకవైపు ప్రకాశిస్తూ ఉండగా, వేరొక వైపు, ఆళ్వారులు శ్రీరామానుజావతారానికి చెందిన భవిష్యద్దర్శనవైభవం కూడా సూచింపబడింది. ఏ విధంగా ? అంటే,

ఈ పాశురంలో ప్రస్తావింపబడిన మగ ఏనుగు ఎవరో కాదు, భగవద్రామానుజులే. పూదత్తాళ్వారులు ద్వాపరయుగం చివరిలో అవతరించారు. ఆ తరువాత, చాలాకాలం గడచిన తరువాత సుమారు నాలుగు వేల సంవత్సరాలకు అనంతరం, భగవద్రామానుజులు కలియుగంలో అవతరించబోతారు, తిరుమల కొండపైకి, వేంచేసి అక్కడ, వేదార్థసంగ్రహం అనే శ్రుతివాక్యసమన్వయ రూపమైన గ్రంథాన్ని ఉపన్యాసరూపంగా అనుగ్రహించబోతారు– అనే సంగతిని ఈ పాశురంలో పూదత్తాళ్వారులు సూచించారు– అని పెద్దల సమన్వయం.

ఇక్కడ పాశురంలో చెప్పబడిన లేత చెరకు అంటే, శ్రుతివాక్యాలే. వీటికి రెండు కణుపులు ఉండడం అంటే, ఆ వాక్యాలు రెండు విధాలుగా ఉండడం. వేదంలోని కొన్ని వాక్యాలు జీవాత్మ పరమాత్మల భేదాన్ని తెలిపేవిగాను, మరికొన్ని అభేదాన్ని తెలిపేవిగాను ఉన్నాయి. పరస్పర అ విరుద్ధంగా తోచే ఈ రెండు విధాలైన వాక్యాలను భగవద్రామానుజులు జీవాత్మ,పరమాత్మల మధ్య శరీరశరీరిభావాన్ని తెలిపే ఘటశ్రుతులను పురస్కరించుకొని మధురంగా సమన్వయం చేశారు. అందుచేత ఈ ఘటకశ్రుతులే తేనె. తిరుమలలో,, చెరకు గడను తేనెలో ముంచి, దగ్గర ఉండే ఆడ ఏనుగుకు మగ ఏనుగు సాదరంగా ఇవ్వడం అంటే, అర్థంలో పరస్పర విరుద్ధంగా తోచే రెండు విధాలైన వేదవాక్యాలను ఘటకశ్రుతులతో

సమన్వయం చేసి, మగ ఏనుగువంటి శ్రీరామానుజులు ఆడ ఏనుగుల వంటి తమ శిష్యులకు మధురంగా వివరించి, బోధించడమే.

భగవద్రామానుజులు తిరుమలకొండపై శ్రీవేంకటేశ్వరుని దివ్యాలయానికి ఎదురుగా ఉండే బేడి ఆంజనేయ స్వామి కోవెలకు ఎదురుగా ఉన్న మండపంలో వేదార్థసంగ్రహం అనే శ్రుతివాక్యసమన్వయ రూపమైన గ్రంథాన్ని ఉపన్యాస రూపంగా శిష్యులకు అనుగ్రహించారని, తరువాత అది గ్రంథరూపాన్ని సంతరించుకున్నదని వారి చరిత్రలో చెప్పబడుతున్నది. కలియుగంలో భవిష్యత్తులో జరగబోయే ఈ సందర్భాన్ని పూదత్తాళ్వారులు తమ దివ్యదర్శనంతో దర్శించి, ఈ పాశురంలో అలంకారికమైన శైలిలో అనుగ్రహించడం చాలా అద్భుతం. అందువల్లనే వారు "పెరుమ్ తమిழన్" అయ్యారు.

ఈ పాశురంలో అళ్వార్లు భగవద్రామానుజులను ఒక మదగజంగా రూపించడాన్ని దృష్టిలో పెట్టుకొనే తిరువరంగత్తముదనార్ అనే ఆచార్యులు ఇరామానుశ నూత్తందాది అనే భగవద్రామానుజ స్తుతిపరమైన ప్రబంధంలోని ఒక పాశురంలో–

"పండరు మాఱన్ పశుమ్ తమిழ் ఆనందమ్ పాయ్ మదమాయ్
విండిడ ఎంగళ్ ఇమానుశన మునివేழమ్, మెయ్ మ్మై
కొండు నల్వేద క్కొழுన్దండ మేంది కువలయత్తే
మండి వందేన్టదు, వాదియర్ కాళ్! ఉంగళ్ వాழ்వు అற்றదే". (64)

(మాకు విధేయంగా ఉండే భగవద్రామానుజులు అనే మదగజం నమ్మాళ్వారులు దివ్యగానంతో ఉపదేశించిన, మనోజ్ఞమైన ద్రావిడ దివ్యప్రబంధం అయిన తిరువాయ్ మొழிలోని పాశురాలను అనుసంధించినందువల్ల కలిగిన

సంతోషం మదమై ప్రవహించగా, వాస్తవమైన అర్థాలను ప్రతిపాదిస్తున్న మూడు దివ్యవేదాలు అనే అందమైన త్రిదండాన్ని ధరించి, భూమండలంలో అంతటా సంచరిస్తూ, మిమ్మలను ఎదిరిస్తున్నది. ఓ దుర్వాదులారా! మీ వాదపటిమ ఇక నశించింది.) అనే పాశురాన్ని అనుగ్రహించారు.

ఈ అద్భుతమైన పాశురాన్ని గమనించి చూసినప్పుడు, భగవద్రామానుజులు వేదంలో పరస్పరం విరుద్ధంగా తోచే భేదాభేదశ్రుతులను, సగుణ నిర్గుణశ్రుతులను ఘటక శ్రుతులతో మేళవించి, సమన్వయం చేయగలగడానికి ఆధారమైనది నమ్మాళ్వారులు అనుగ్రహించిన తిరువాయ్ మొழி దివ్యప్రబంధంలోని సూక్తులే— అనే విషయం అర్థం అవుతున్నది.

ఈ విధంగా ఆళ్వారుల ప్రబంధాలతో పరిచయం లేనందువల్లనే, మిగిలిన సిద్ధాంతాలలో ఈ విధమైన సమన్వయం చేయడానికి సాధ్యం కాలేదు – అనేది ఇక్కడ గుర్తించదగిన వాస్తవం.

★★★★★

# ఆళ్వారుల సూక్తులలో లక్ష్మీకల్యాణమ్

"జగత్కారణం తు ధ్యేయః" అని "జగత్కారణతత్త్వమే ధ్యానించదగినది"– అని నిర్ణయించి పలికిన వేదాంతాలు, ఆ జగత్కారణ వస్తువు ఏదో నిశ్చయించి పలికే క్రమంలో, "అసద్వా ఇద మగ్ర ఆసీత్", "సదేవ సౌమ్య ఇదమగ్ర ఆసీత్" బ్రహ్మ వా ఇదమేవాగ్ర ఆసీత్" అని అంటూ ఒకచోట అసత్ అని, ఇంకొక చోట సత్తు అని, ఇంకొక చోట బ్రహ్మ అని, ఈ విధంగా పలు పదాలతో ఆ జగత్కారణతత్వాన్ని నిర్దేశించి తెలిపినప్పటికీ, మహోపనిషత్తులో " ఏకో హ వై నారాయణ ఆసీత్, న బ్రహ్మే నేశానః" అని అంటూ నారాయణుడే సృష్టికి పూర్వం ఉన్నాడని, బ్రహ్మ కానీ, ఈశ్వరుడు కానీ లేడని స్పష్టంగా చెప్పినందువల్ల, నారాయణుడే జగత్కారణ తత్వమని తెలియజేసింది. ఈ నిర్ణయం సర్వవేదాంత ప్రత్యయన్యాయంద్వారా స్పష్టమవుతున్నదని మన పూర్వాచార్యుల అభిప్రాయం.

ఈ విధంగా జగత్కారణతత్వం నారాయణుడే అని తెలియజేసిన ఆ వేదమే ఆ నారాయణుడు కేవలనారాయణుడు కాదని, లక్ష్మీవిశిష్టుడైన నారాయణుడే జగత్కారణతత్వమనికూడా నిశ్చయించి పలికింది. పురుషశబ్దవాచ్యుడైన భగవంతునినుండి ఈ సమస్తమైన అచేతనరూపమైన జగత్తు ఆవిర్భవించిందని చెప్పే క్రమంలో ఆ వేదం "సర్వే నిమేషా జజ్ఞిరే విద్యుతః పురుషాదధి" (కలాకాష్ఠాదిరూపమైన సమస్తకాలతత్వం విద్యుద్వర్ణాన్ని కలిగిన పురుషునినుండి ఆవిర్భవించింది) అని అన్నది. ఇక్కడ, జగత్తుకు మూలమైన పురుషుడు విద్యుద్వర్ణాన్ని కలిగినవాడు –అని అనడం, అతడు లక్ష్మీసహితుడు అని సూచించడమే– అని అభిజ్ఞులైన మన పూర్వాచార్యుల నిర్ణయం. ఈ శ్రుతివాక్యంలో కేవలం కాలతత్వం మాత్రమే చెప్పబడినా, ఇది సకలమైన అచేతనపదార్థాలకు

ఉపలక్షణం. ఈ విధంగా వేదం పురుషశబ్దంచేత చెప్పబడే లక్ష్మీసహితుడైన శ్రీమన్నారాయణుడే జగత్కారణతత్వమని, అతడే ఉపాసించదగినవాడని నిర్ణయించి తెలిపింది. ఈ అర్థాన్నే శ్రీపాంచరాత్రం లక్ష్మీతంత్రం మొదలైన సంహితలలో తెలియజేసింది. శ్రీరామాయణం, పురాణ వాఙ్మయం, ఈ తత్వాన్నే తెలియజేపింది.

నమ్మాళ్వారులుకూడా, ఇదే క్రమంలో, లక్ష్మీవిశిష్టుడైన నారాయణుడే పరతత్వమని, అతడే ఉపాసించగగినవాడని తిరువాయ్ మొళి దివ్యప్రబంధంలోని మొదటి మూడు దశకాలలో తెలియజేయడం గమనించదగినది.

"ఉయర్వ్ఱ " అనే మొదటి దశకంలో నిస్సమాభ్యధికమైన ఆనంద గుణాన్ని కలిగిన పరతత్వాన్ని ఆరాధించమని పలికిన ఆళ్వారులు, " వీడుమిన్" అనే రెండవ దశకంలో ఆ పరతత్వం " వణ్ పుకழ் నారణన్" (నిత్యసిద్ధ కళ్యాణ గుణాలను కలిగిన నారాయణుడు) అని విశదీకరించి, ఆ నారాయణుడు కేవల నారాయణుడు కాదని, లక్ష్మీసహితుడైన నారాయణుడే అని మూడవ దశకంలో " తిరువుడై అడిగళ్"(లక్ష్మీసహితుడైన స్వామి) అని అనడంద్వారా నిశ్చయించి పలికారు. ఈ సిద్ధాంతాన్నే మిగిలిన ఆళ్వారులుకూడా తమ దివ్యప్రబంధాలలో ఉపదేశించారు. భగవద్వైభవంతో పాటు లక్ష్మీవైభవాన్ని కూడా తమ సూక్తులలో పలు చోట్ల ప్రస్తుతించారు.

భగవంతుడైన శ్రీమన్నారాయణుని స్వరూపరూప గుణవిభూతి లీలలను వేదం కీర్తించినట్లే, వేదోపబృంహణాలు, అళ్వారుల దివ్యప్రబంధాలు ప్రస్తుతించాయి. మత్స్య కూర్మ వరాహ నారసింహ త్రివిక్రమ రామకృష్ణాది భగవదవతారాలను వేదం స్తుతించింది. ఆ విధంగానే,లక్ష్మీవైభవాన్ని స్తుతించడంకోసంగా వేదంలో ఏర్పడిన

శ్రీసూక్తం లక్ష్మి క్షీరాబ్ధినుండి ఉద్భవించిన వృత్తాంతాన్ని ఒక ఋక్కులోని ఒక నామంద్వారా తెలియజేసింది. ఆ సూక్తంలోని "చంద్రాం ప్రభాసాం యశసా జ్వలంతీమ్" ఇత్యాది ఋక్కులో ఉండే "చంద్రామ్" అనే నామం దీనిని తెలియజేస్తున్నదని వ్యాఖ్యాతలు వ్యాఖ్యానించారు. ఈ నామం "చంద్రునకు సహోదరి"– అనే అర్థం ఇస్తున్నదని వ్యాఖ్యానించి, పాలకడలిని దేవాసురులు చిలికినప్పుడు చంద్రునకు పిమ్మట అవతరించినది –అని, చంద్రుని తన అంశగా, అంటే, కిరణంగా కలిగినది – అనే అర్థాలను తెలిపారు. ఈ నామనిరుక్తిని తెలియజేసే ఈ క్రింది కారికలు ఈ విషయాన్ని తెలుపుతున్నాయి.

"ఉద్గతః ప్రథమో యోం ఽ శుః క్షీరసాగరమంథనే,
చంద్రాం స మదీయోంఽ శు రుద్గంచ్ఛంత్యాః పురస్సరః,
ఋషయో మత్ప్రభావజ్ఞాః మాం తు చంద్రాం ప్రచక్షతే"

(పాలసముద్రాన్ని చెలికేటప్పుడు, ముందుగా నా ఏ కిరణం బయటకు పైకి ప్రసరించిందో, అతడే చంద్రుడు. నా మహిమను తెలిసిన ఋషులు అందువల్ల నన్ను "చంద్రా" అని పిలుస్తున్నారు)

ఈ విధంగా శ్రీసూక్తంలో ప్రస్తావింపబడిన లక్ష్మీప్రాదుర్భావ వృత్తాంతాన్ని శ్రీవిష్ణుపురాణం శ్రీభాగవతం మొదలైన ఉపబృంహణాలు విస్తృతంగా వర్ణించాయి. శ్రీవిష్ణుపురాణంలోని మొదటి అంశలోనే తొమ్మిదవ అధ్యాయంలో ఈ వృత్తాంతం వర్ణింపబడింది. శ్రీభాగవతంలో అష్టమస్కంధంలోని ఎనిమిదవ అధ్యాయంలో ఈ కథ ప్రస్తావింపబడింది. పాలసముద్రంనుండి ఉద్భవించిన లక్ష్మీదేవి బ్రహ్మేంద్రాది దేవతలను అందరిని నిరాకరించి, నారాయణునే తన పతిగా వరించిన సందర్భం ఆ స్వామి పరత్వాన్ని తెలియజేస్తున్నదని ఆ రెండు పురాణాలు తెలిపాయి. శ్రీవిష్ణుపురాణంలో ఉండే "పశ్యతాం సర్వదేవానాం యయౌ వక్షఃస్థలం హరేః"

(దేవతలందరూ చూస్తూ ఉండగానే లక్ష్మీదేవి విష్ణువక్షఃస్థలాన్ని చేరింది) అనే శ్లోకంలోని "పశ్యతాం సర్వదేవానామ్" అనే చోట ప్రయోగింపబడిన షష్ఠీవిభక్తి " అనాదరే షష్ఠి" అని, అంటే, లక్ష్మీదేవి మిగిలిన దేవతలను అందరిని అనాదరించడాన్ని తెలుపుతున్నది– అని శ్రీకృష్ణసూరి (పెరియవాచ్చాన్ పిళ్ళై) వివరించారు. ఈ అర్థాన్నే శ్రీభాగవతంకూడా బాగా వివరించింది.

లక్ష్మీసహితుడైన నారాయణుని వైభవాన్ని కీర్తించే ఆళ్వారులుకూడా తమ దివ్యప్రబంధాలలో పలుచోట్ల లక్ష్మీప్రాదుర్భావ ఘట్టాన్ని, ఆమె నారాయణుని పతిగా వరించిన సందర్భాన్ని వర్ణించారు.

గోదాదేవి తిరుప్పావై ప్రబంధంలో సంగ్రహంగా ఈ రెండు వృత్తాంతాలను చిట్ట చివరి పాశురంలోని " వంగ క్కడల్ కడైంద మాదవనై" (ఓడలతో నిండి ఉండే సముద్రాన్ని చిలికిన లక్ష్మీపతిని) అనే సూక్తిద్వారా ప్రస్తుతించారు.

నమ్మాళ్వారులు తిరువాయ్ మొళి ప్రబంధంలో (4–2–7) వ పాశురంలో ప్రయోగించిన " మడన్దైయై వణ్ కమల త్తిరుమాదినై తడమ్ కొళ్ తార్ మార్బినిల్ వైత్తవర్" అనే ప్రయోగంలో ఈ స్వయంవర వృత్తాంతాన్ని అనుసంధించారు. ఈ ప్రయోగాన్ని నమ్పిళ్ళై ఈడు వ్యాఖ్యానంలో " ఎల్లప్పుడూ భోగయోగ్యమైన పరువాన్ని కలిగినది, అందమైన తామరపువ్వును నివాసస్థానంగా కలిగిన లక్ష్మి అనే వధువును, చాలా విశాలమైనది, వనమాలచే అలంకరింపబడినది అయిన తన వక్షఃస్థలంలో నిలుపుకున్నవాడు. "పశ్యతాం సర్వదేవానాం యయౌ వక్షఃస్థలం హరేః" అనే విధంగా క్షీరాబ్ధిమథనసమయంలో ప్రాదుర్భవించిన ఆ లక్ష్మీదేవి "నాకు నీ వక్షస్సును నివాసస్థానంగా అనుగ్రహించాలి" తన దగ్గరకు రాగా, ఆమెను తన వక్షఃస్థలంలో పెట్టుకున్నవాడు" అని వివరించడం దీనిని వ్యక్తం చేస్తున్నది. ఇదే క్రమంలో ఇరుపత్తు

నాలాయిరప్పడి వ్యాఖ్యానంలో శ్రీకృష్ణసూరి అనబడే పెరియ వాచ్చాన్ పిళ్ళై, పన్నీరాయిరప్పడి వ్యాఖ్యానంలో అళగియ మణవాళ చ్చీయర్ ఈ ప్రయోగాన్ని వ్యాఖ్యానించారు.

ఇక్కడ ఒక విశేషం ఉన్నది. నమ్మాళ్వారులు, ఈ పాశురంలోనే కాక చాలా పాశురాలలో భగవంతుని కీర్తించేటప్పుడు, "లక్ష్మిని తన వక్షస్సులో నిలుపుకున్నవాడు" అని అన్నారుకదా. మరి, ఈ ప్రయోగంలో మాత్రమే లక్ష్మీస్వయంవరసందర్భాన్ని ఆళ్వారులు అనుసంధించినట్లుగా పూర్వాచార్యులు వ్యాఖ్యానించడంలో అభిప్రాయం ఏమి? అనే సందేహం కలుగుతుంది. ఈ సందేహాన్ని అరుంబదవివరణకారులు తీరుస్తూ, ఈ దశకంలో ఉండే అన్ని పాశురాలలోనూ భగవంతుని అవతారాలను నమ్మాళ్వార్లు కీర్తిస్తున్న కారణంచేత, ఈ ప్రయోగంకూడా ఒక అవతార సందర్భాన్ని ప్రస్తుతిస్తున్నదే అయి ఉండాలి– అని భావించిన వ్యాఖ్యాతలు ఈ విధంగా వ్యాఖ్యానించారు – అని తెలియజేయడం గమనించదగినది.

పేయాళ్వార్లు కూడా తమ మూన్రామ్ తిరువందాది ప్రబంధంలో ఈ లక్ష్మీస్వయంవర వృత్తాంతాన్ని ఒక పాశురంలో ప్రస్తావించారు. ఆ ప్రబంధంలోని 16వ పాశురంలో " ఎంద్రై ఒరువల్లి త్తామరైయాళ్ ఒన్డియ శీర్ మార్బన్" (సాటి లేని పూరేకులను కలిగిన తామరపువ్వును నివాసస్థానంగా కలిగిన లక్ష్మీదేవి వచ్చి చేరే అందమైన వక్షస్సును కలిగినవాడు) అనే ప్రయోగంలో ఈ వృత్తాంతం అనుసంధింపబడింది– అని పూర్వాచార్యుల అభిప్రాయం.

ఈ సూక్తిని వ్యాఖ్యానిస్తూ శ్రీకృష్ణసూరి ఒక సందేహాన్ని లేవనెత్తి, దానికి లోకన్యాయాన్ని అనుసరించి ఈ క్రింది విధంగా సమాధానం చెప్పడం కూడా ఇక్కడ గమనించదగినది.

ఉత్తమస్త్రీ పరుల సమక్షంలో భర్త సాన్నిధ్యాన్ని చేరదు కదా. మరి, స్త్రీలలో ఉత్తమ అయిన లక్ష్మీదేవి అంతమంది దేవతలు చూస్తూ ఉండగా భగవానుని వక్షస్సును ఏ విధంగా జంకు లేకుండా చేరింది? అనే సందేహం ఇక్కడ కలిగే అవకాశం ఉన్నది. కానీ, అటువంటి సందేహానికి తావు లేదు. ఎందుకంటే, అక్కడ ఉండే దేవతలు అందరూ సమస్తజగత్తుకు తల్లి, తండ్రి అయిన లక్ష్మీ, నారాయణులకు సంతానమేకదా. తన సంతానం సమక్షంలో తల్లి భర్త దగ్గరకు వెళ్లడంలో సంశయించవలసిన పనిలేదు. ఈ సమాధానాన్ని శ్రీకృష్ణసూరి " ప్రజైకళ్ పార్ త్తిరుక్క భర్తావిన్ పడుక్కైయిలే కణిశిత్తు ఏఱువారైపో , దేవర్ గళ్ పార్ త్తు క్కిడక్క తిరుమార్బిలే ఏఱినాళ్" (సంతానం చూస్తూ ఉండగా భర్త శయ్యను భార్య ఆదరించి చేరేటట్లుగానే, దేవతలు చూస్తూ ఉండగానే భగవంతుని వక్షస్సును లక్ష్మీదేవి చేరింది) అనే వ్యాఖ్యాన సూక్తిద్వారా అనుగ్రహించారు.

ఈ విధంగానే ఇంకా మరికొన్ని పాశురాలలో ఈ వృత్తాంతాన్ని ఆళ్వారులు అనుసంధించిన వైనం మనకు గోచరిస్తుంది.

★★★★★

# శ్రీవేంకటేశ్వరుడు చేసే పోరాటం

జగత్ప్రభువు, దేవాధిదేవుడు అయిన భగవంతుడు శ్రీమన్నారాయణుడు ఆసుర ప్రకృతులు తన భక్తులను బాధించేటప్పుడు, ధర్మానికి హాని కలిగినప్పుడు మత్స్య కూర్మ వరాహాదిరూపాలలో అవతరించి, దుష్ట శిక్షణను సాధు పరిత్రాణాన్ని, ధర్మసంస్థాపనను చేస్తాడు. అతడే "మాటిల్ పోర్ అరక్కన్ మదిళ్ నీఱు చ్చెற்றுగంద ఏఱు శేవగనార్" (సాటిలేని యుద్ధాన్ని చేయగలిగిన రావణుని లంకానగరంలోని ప్రకారాలు అన్ని భస్మీభూతం అయ్యేటట్లు చేసి, ఆనందించిన సాటి లేని విలుకాడు) అనే కీర్తింపబడేటట్లుగా శ్రీరాముడై అవతరించి, వానర సేనను సహాయంగా చేసికొని, అన్ని విధాలయిన సామర్థ్యాలను కలిగిన రావణుని, అతని రాక్షససేనను వధించాడు. గోపాలుడై, పూతన, శకటాసురుడు, శిశుపాలుడు, కంసుడు మొదలైనవారిని వధించి, తన సర్వరక్షకత్వాన్ని సర్వలోక శరణ్యత్వాన్ని స్థాపించాడు. సర్వస్వామి అయిన భగవంతుడు శాస్త్రాలను అనుగ్రహించి, అక్కడక్కడ అర్చారూపిగా నెలకొని ఉండి, తన సంపద అయిన చేతనాచేతనాలను అన్నిటిని ఈనాటికీ రక్షిస్తూ ఉన్నాడు. రక్ష్యవస్తువును శత్రువుల నుండి రక్షించడం రక్షకుడైన అతని కర్తవ్యమే కదా.

శ్రీమద్వేదాంతదేశికులు అఖిలాండకోటి బ్రహ్మాండ నాయకుడైన శ్రీవేంకటేశ్వరుడు మనలను రక్షించి మోక్షపర్యంతమైన ప్రయోజనాన్ని అనుగ్రహించడం కోసం ఒక పెద్ద పోరాటాన్నే చేస్తున్నాడు– అని అంటున్నారు. ఆ విధంగా ఆ స్వామి ఎవరితో యుద్ధం చేస్తున్నాడు?

> కరుణే దురితేషు మామకేషు ప్రతికారాంతర దుర్జయేషు ఖిన్నః,
> కవచాయితయా త్వయైవ శార్ జ్గీ విజయస్థాన ముపాశ్రితో వృషాద్రిమ్.
> (దయా శతకం– 28)

## శ్రీవేంకటేశ్వరుడు చేసే పోరాటం

భగవంతునకు మనస్సులో –ఈ లోకంలో ఉండే చేతనులు అందరిని ఈ సంసారం నుండి అనే పెద్దపాడు గోతిలో నుండి ధరించి తన దగ్గరకు చేర్చుకోవాలి అనేది ఆశ.

ఇది ఎప్పుడు సిద్ధిస్తుంది? అని అంటే, భగవంతుడు వారి పాపాలను అన్నిటిని నశింపచేసిన తరువాతనే. భగవంతుడు "మామేకం శరణం వ్రజ" –నన్ను శరణు పొందు– అని ఆజ్ఞాపించాడు. "ఆ విధంగా నన్ను శరణు పొందినట్లయితే, నేను నీ అని పాపాలనుండి విడపించి మోక్షాన్ని అనుగ్రహిస్తాను. " అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి" అని కూడా అన్నాడు.

కానీ, ఈ చేతనులను చూస్తే, "నేను పరతంత్రుడను కాను, నీకు సంబంధించిన వాడను కాను" అని కదా వారు భావిస్తున్నారు. ఇదే కదా, వారు భగవంతుని ఆజ్ఞను అతిక్రమించి వారు చేసే భగవద్భాగవతాపచారాలకు కారణం అవుతున్నది. ఆ పాపాలు ఎటువంటివై ఉన్నాయి? అంటే, రావణ వధ సమయంలో శ్రీరాముడు అతని తలలను ఎన్నిసార్లు ఖండించినప్పటికీ, ఆ తలలు మాటిమాటికి మొలచినట్లే, వీరి పాపాలు కూడా ఆది అంతం లేకుండా ఒక ప్రవాహంగా పుడుతూనే ఉన్నాయి మనలను ఏ విధంగానైనా సరే రక్షించాలి– అని తహతహలాడే భగవంతుని హృదయాన్ని ఈ పాపాలు అస్త్రాలవలె తీవ్రంగా తాకుతున్నాయి. యుద్ధంలో అస్త్రాలను మాటిమాటికి ప్రయోగించేవానికే కదా జయం కలుగుతుంది. ఆ విధంగానే మనం మాటిమాటికి పాపాలను చేయడం వల్ల,అవి ఒక పాపాస్త్రపరంపరలుగా మారి, భగవంతుని తీవ్రమైన బాణాల వలె తాకి బాధిస్తున్నాయి. తాను ఈ సంసారులను రక్షించి తరింప చేయడం సాధ్యం కాక, ఈ విధంగా ఉండే యుద్ధం నిరంతరంగా కొనసాగుతూ ఉండడం భగవంతుని చాలా వేదన కలిగిస్తున్నది.

భగవంతుడు సర్వజ్ఞుడు, సర్వశక్తి అయినప్పటికీ, శాస్త్రాలను తానే వ్యక్తం చేసినప్పటికీ, తరువాత ఆళ్వారులను, పూర్వాచార్యులను అవతరింప చేసి వారిద్వారా మంచి ఉపదేశాలను చేయించినప్పటికీ, అపరాధ చక్రవర్తులైన ఈ చేతనులు చేసే పాపాలను లెక్క కట్టి చూస్తే, ఏ కాలంలోనూ వీరికి మోక్షప్రసక్తి అనేది ఏమీ లేకుండా పోయింది. పంచాయుధాలను ధరించి ఉన్నప్పటికీ కూడా, చేతనుల పాపాల విషయంలో అవి ఏమి ఉపయోగం పడకుండా పోయాయే! అయ్యో ! అని భగవంతునకు చాలా విచారం కలిగినది.

అపుడు, ఇక వేరు ఏ రీతిలోనూ పోగొట్టడానికి సాధ్యం కాకుండా ఉండే వీరి పాపాలను భగవానుడు నశింప చేయడానికి ఒక అద్వితీయమైన ఉపకారాన్ని దయాదేవి భగవంతునకు చేస్తున్నది. అది ఏమి? అని అంటే,

తాను శ్రీనివాసుని దివ్య ఆత్మ స్వరూపానికి ఒక కవచంగా మారుతున్నది. తన చేతిలో శార్ జ్ఞమ్ అనే వింటిని ధరించి, దయా దేవి అనే ఒక కవచాన్ని ధరించి చేతనుల పాపాలతో శ్రీనివాసుడు యుద్ధం చేస్తున్నాడు.వారి పాపాలు దయ అనే కవచం పైన పడి ఏమీ చేయలేక వ్యర్థమైపోతున్నాయి. వారి పాపాలను నశింపచేసి, విజయాన్ని పొందడం కోసం తగిన ఒక చోటును శ్రీనివాసుడు అన్వేషించాడు. దానికి తగిన చోటు శ్రీవేంకటాచలమే అని చూసాడు. ఎందుకంటే, అది వేంకటం కదా. అంటే, వేం కటమ్– పాపాలను నశింప చేసేది కదా. ఆ పర్వతాన్ని చూడగానే మోక్ష విరోధులై ఉండి వీరి పాపాలు నశించిపోతాయి– అని భగవంతుడు నిర్ణయించుకున్నాడు. ఆ పర్వతంలోనే దివ్య మంగళ రూపంలోని అందాన్ని, కళ్యాణ గుణాలను దర్శింప చేస్తూ, దయాదేవితో పాటు నిత్య వాసం చేస్తున్నాడు. ఈ విధంగా దయాదేవి అతని మనసులో ఒక కవచంగా నిలచి, ఒకే సమయంలో చేతనుల పాపాలను నిర్వీర్యం చేసి, భగవంతుని మనస్సులో చేతనుల పాపాలు

చోటు చేసుకోకుండా ఉండేటట్లు చేసి,ఈ మహా యుద్ధంలో భగవంతుడు విజయం సాధించేటట్లు చేసి, దాని మూలంగా అతనికి వైషమ్యం, దుఃఖం అనే దోషాలు అంటకుండా ఉండేటట్లుగా చేసి మహోపకారాన్ని చేస్తున్నది– అని, మన పాపాల పరాక్రమాన్ని దయాదేవి నశింపచేసి, భగవంతుడు మన విషయంలో ఒక అద్వితీయమైన అనుగ్రహ విశేషం ఏర్పడేటట్లుగా ఆ దయాదేవి చేసే మహోపకారాన్ని వర్ణిస్తూ చాలా అందంగా, రసోక్తిగా, అత్యాశ్చర్యకరంగా వేదాంతదేశికులు అనుగ్రహిస్తున్నారు.

ఒకడు తన జీవితంలో ఒకసారి అయినా గోవింద నామాచ్చారణను చేస్తూ తిరుమలలో వేంచేసి ఉండే శ్రీవేంకటేశ్వర స్వామిని సేవించినట్లయితే, అతని పాపం ఒక్క కణం కూడా మిగలకుండా నశించిపోతుంది –అని ఇక్కడ సూచింపబడింది. ఆ పర్వతం పై ఉండే స్వామి దయాదేవిని కదా, కవచంగా ధరించి ఉన్నాడు.

★★★★★

# భక్తుల దోషం ఎరుగని గోపాలుడు

ప్రకృతి సంబంధం కారణంగా మనకు ఏర్పడే విపరీత జ్ఞానం అనేది మన లక్షణానికి విరోధమై, భగవంతుని విషయంలో పలు విధాలయిన అపచారాలను చేయించి, ఆ స్వామి విషయంలో మాటిమాటికి అపచార పడేటట్లు చేస్తుంది. ఇది అతనికి మనపై చాలా కోపం కలిగిస్తుందే అనే భీతికూడా మనకు కలుగుతుంది. అయితే, శరణం పొందిన ఆశ్రితుని విషయంలో అతడు అవిజ్ఞాతగా ఉంటాడు కదా. సర్వజ్ఞుడైన భగవంతుడు తెలియని విషయం అనేది ఒకటి ఉంటుందా? భగవంతుని సర్వజ్ఞాత అని అనడం కదా తగివున్నది!. మరి, ఆ విధంగా ఉండగా, ఇక్కడ తెలియనివాడు అని అనడం ఎందువల్ల? అంటే,

ఈ భగవంతుడు తన విషయంలో ఆశ్రితుడు ఎంతటి అపచారాన్ని చేసినప్పటికీ కూడా,అతడు దానివల్ల కొంచెం కూడా మనసులో కోపాన్ని పొందకుండా, వారి విషయంలో కలిగి ఉండే పక్షపాతం చేత వారు చేసే వేలాది దోషాలను సహించే అతని వాత్సల్యాన్ని తెలుపుతున్నది.

వేదాంతదేశికులు ఈ విధంగా అనుగ్రహిస్తున్నారు.

మற்றொరు పற்றిన్ఱి వందడైందార్ క్కెల్లామ్
కుற்ற మఱియాద కోవలనార్, – ముற்றుమ్
వినై విడుత్తు విణ్ణవరోడు ఒన్ఱ విరైకిన్ఱార్
నినైవుడైత్తాయ్ నీ మనమే! నిల్లు. (అమృత రంజని –36)

(వేరు ఏ శరణం లేకుండా, తన వద్దకు వచ్చి శరణు పొందినవారి ఏ దోషాలను తెలియని, గమనించని గోపాలుడు ఆ భక్తులు చేసిన దోషాలను అన్నిటినినుండి వారిని విడిపించి, పరమాపద వాసులతో పాటు సమానంగా వారిని చేయడం కోసం త్వరపడుతున్నాడు. ఓ మనసా! నీవు ఎటువంటి భయం లేకుండా స్థిరంగా ఉండు) అని– ఆ స్వామి పాదాలలో శరణు పొందిన అందరి

విషయంలోనూ గోపాలుడై అవతరించిన పరమపద నాథుడు వారు చేసిన దోషాలను ఈనాడు లెక్కపెట్టబోడు అందుచేత బాధపడనక్కరలేదు–. అని భగవంతుని అపరాధ సహత్వాన్ని పురస్కరించుకొని, తమ మనసుకు ఉపదేశం చేస్తున్నారు, దేశికులు.

"మొழியై క్కడక్కుమ్ పెరుమ్ పుకழான్" (వాచామగోచరమైన గొప్ప గుణాలను కలిగినవారు) అనే కీర్తిని కలిగిన కూరేశులు వరదరాజస్తవంలో వరదరాజస్వామి వాత్సల్యాన్ని అనుభవిస్తూ–

"ఉపాలంభో ౽ యం భోః! శ్రయతి బత! సార్వజ్ఞ్యమపి తే
యతో దోషం భక్తేష్విహ వరద!నైవాకలయసి" (వరదరాజస్తవం– 20)

అని అనుగ్రహించారు. అంటే, భక్తుల దోషాలు కొంచెం కొంచెంగా కాకుండా, కొండలు కొండలుగా పేరుకు పోయినప్పటికీ, వాటిని తెలియకుండా ఉండడం అనేది భగవంతునకు అవిజ్ఞాత అనే తిరునామం రావడానికి పోసగి ఉన్నదే తప్ప, అతని సర్వజ్ఞత్వానికి అనుగుణం కాదు– అని అంటున్నారు.

భగవంతుని వాత్సల్యం అనే గుణం భక్తులు చేసే ఏ విధమైన దోషాన్ని అయినా మన్నించి, రక్షించేటట్లు ఆ స్వామిని చేస్తుంది. ఆ విధంగా అయితే, మనం దోషాలు చేయవచ్చును– అని భావించరాదు.భక్తుల. దోషాలను క్షమించడం అనేది అతని సహజ గుణం. అతని విషయంలో, ఆ స్వామి భక్తుల విషయంలోనూ దోషాలు చేయకుండా, ఆళ్వారులు, పూర్వాచార్యులు మనకు నియమించిన రీతిలో ఆ స్వామిని శరణు పొంది, అతనికి కైంకర్యాన్ని చేయడమే శేషి అయిన మన ఆత్మ స్వరూపానికి అందం.. ఆ గుణాన్ని పెంపొందించుకొని బాగుపడడమే మనకు ఉచితం.

★★★★★

# భగవంతునకు ఏ విధంగా దేనిని సమర్పించి ఆరాధించాలి?

భగవంతునకు కైంకర్యం చేయాలి అనే ఆశ చాలా మంది చేతనులకు ఉన్నప్పటికీ, చాలా గొప్పవాడైన ఆ స్వామిని ఆరాధించటానికి ప్రయత్నించినప్పుడు ఏ కొరత లేకుండా అతనిని ఆరాధించాలి కదా! అది ఏ విధంగా సాధ్యం అవుతుంది? అని వారిలో కలిగే అభిప్రాయం వారు భగవంతునకు చేసే కైంకర్యానికి ఆటంకం అవుతుంది.

అతడు అవాప్త సమస్త కాముడు మనల్ని చులము నీచుడైన ఈ జీవుడు చాలా తక్కువ విలువ కలిగిన ఉపకరణాలతో అతనిని ఏ విధంగా ఆరాధించాలి? ఒకవేళ ఆ విధంగా చేసినప్పటికీ, పరమపదనాథునకు అది తగినది అవుతుందా? అనే సందేహంతో ఆ భగవంతుని ఆరాధనను కొందరు విడచి పెట్టే అవకాశం ఉన్నది.

దీనిని దృష్టిలో పెట్టుకుని నమ్మాళ్వారులు తిరువాయ్ మొழி ప్రబంధంలో ఒక చక్కని ఉపదేశాన్ని ఈ విధంగా చేస్తున్నారు.

"పరివదిల్ ఈశనై ప్పాడి విరివదు మేవల్ ఉఱువీర్,
పిరివకై ఇన్ఱి నన్నీర్ తూయ్ పురివదువుమ్ పుకై పూవే" (1–6–1)

భగవంతుడు శీలగుణం కలిగినవాడు. అతనికి మన విషయంలో కలిగి ఉండే అంతు లేని దయవల్ల మనం ఆరాధించడానికి సులభుడై, మనం సమర్పించినది ఏది అయినా, దానిని గ్రహించి తృప్తి పడతాడు. ఆ స్వామికి చేసే తిరువారాధన కోసం తీర్థం ఒక్కటే చాలు. ఆ తీర్థం కూడా యాలకులు మొదలైన వాసనద్రవ్యాలతో, తులసి మొదలైన శుద్ధ వస్తువులతో కలసి ఉన్నదై ఉండాలి అనే

భగవంతునకు ఏ విధంగా దేనిని సమర్పించి ఆరాధించాలి?

నియమం లేదు. పుష్పం ఎటువంటిది అయినప్పటికీ దోషం లేదు. భక్తుడు సమర్పించే క్రమాన్ని తప్పకుండా సమర్పించాలి అనేది కూడా లేదు. ఇంతకుమించి, ఏ వస్తువునైనా అతడు సమర్పించవచ్చు. సుగంధ ధూపాన్ని సమర్పించాలి అనే నియమం లేదు.ఏ ధూపాన్ని అయినా సమర్పించండి. భగవంతునకు సమర్పిస్తున్నాము అనే పరిశుద్ధమైన భావం, అతని విషయంలో పరిపూర్ణమైన భక్తి, ప్రేమ మాత్రమే ప్రధానమైనవి. అవాప్త సమస్త కాముడైన ఆ స్వామి విషయంలో మనం కొన్ని వస్తువులను సమర్పించడం అనేది మన స్వరూపానికి ప్రకాశాన్ని కలిగించుకోవడానికి తప్ప, అతని కొరతను తీర్చడం కోసం మాత్రం కాదు– అని ఆ స్వామి స్వారాధ్యత్వాన్ని నిరూపించి పలుకుతున్నారు, ఆళ్వారులు.

★★★★★

# భగవద్గుణదర్పణమహిమ

# (సహస్రనామభాష్యవైభవమ్)

(మహావిద్వాన్, కాంచీ ప్రతివాది భయంకరమ్ అణ్ణంగరాచార్యస్వామివారు)

శ్రీవిష్ణుసహస్రనామానికి లోకంలో ప్రసిద్ధమైన అద్వైత విశిష్టాద్వైత ద్వైతాలనే మూడు విధాలైన మతాలకు చెందిన ఆచార్యులచేత భాష్యాలు రచింపబడినవి. వాటిలో, మన విశిష్టాద్వైత సంప్రదాయా ానికి అనుగుణంగా రచింపబడిన భాష్యం పరాశరభట్టర్ రచించినదే. దానికి భగవద్గుణ దర్పణం అని పేరు. ఈ పేరు దానికి చాలా తగి ఉన్నది. భగవద్గుణానుభవాన్ని పొందాలనే ఆసక్తి కలిగినవారు ఈడు ముప్పత్తాఱాయిరప్పడి అనే భగవద్విషయ దివ్యగ్రంథంతో కాలక్షేపం చేయడం అనేది ప్రసిద్ధం. అందులో అవగాహహించే యోగ్యత లేనివారై ై శుద్ధమైన సంస్కృతపండితులై ఉండేవారై, శాస్త్రజ్ఞానం కలిగినవారు అద్భుతంగా భగవద్గుణానుభవాన్ని పొందాలని కోరితే, వారికి భట్టర్ అనుగ్రహించిన సహస్రనామ భాష్యమే గతి– అని చెప్పవచ్చు.

శ్రీపరాశర భట్టర్ ఈ భాష్యాన్ని అనుగ్రహించడానికి ముందే శంకరుల సహస్రనామభాష్యం అవతరించింది. నిర్గుణబ్రహ్మవాదులు సకల కళ్యాణ నిధి అయిన భగవంతుని తిరునామాలకు అర్థాన్ని చెప్పాలని ముందుకు రావడం అనేది సాహసమే! అని భట్టర్ అభిప్రాయమని తోస్తుంది.

భగవద్గుణాలను అద్భుతంగా అనుభవించడం కోసమే ఏర్పడిన ఈ సహస్రనామానికి ఆళ్వారుల హార్దమైన, ఆర్ద్రమైన వచనాలలో అవగాహించినవారు కదా, అర్థాన్ని చెప్పడానికి ముందుకు రావాలి. ఆ దివ్యసూరుల సూక్తులకు చాలా

దూరంలో ఉండేవారైన ఇతర మతాలవారు దీనికి అర్థాన్ని చెప్పాలని ప్రయత్నం చేసి, తమ మనసుకు తోచినట్లుగా వ్యాఖ్యానం చేయడం అనేది ఎంత సాహసం! అని చాలా బాధపడిన భట్టర్, తాము ఆ స్తోత్రానికి వ్యాఖ్యానం రచించడం కోసం భగవద్రామానుజుల నియమనాన్ని పొందారు. భగవద్గుణానుభవాన్ని పొందడం కోసమే అవతరించినవారిలో అగ్రేసరులు, భట్టర్. ఆళ్వార్ శ్రీసూక్తులు అనే మహాసముద్రంలో లోతుగా అవగాహవించి, చాలా అరుదైన అర్థాలను అద్భుతంగా అనుభవించి, ఇతరులను అనుభవింప జేయడంలో పరమరసిక సార్వభౌములైన భట్టర్ అనుగ్రహించిన భాష్యాన్ని మన సంప్రదాయనానికి చెందినవారిలోకూడా పరిపూర్ణంగా సేవించినవారు చాలా కొద్దిమంది. నిజానికి ఈ భాష్యాన్ని అనుభవించే అధికారులు దుర్లభులు అనే చెప్పాలి. ఎందుకంటే, "పరిచితమివ అథాపి గహనం బహుముఖయ వాణీవిలసితమ్ " అని శ్రీరంగనాయకిని ఉద్దేశించి తాము ప్రార్థించిన రీతిలోనే అతిగంభీరమైన పద ప్రయోగ విన్యాసాలను ప్రయోగించి ఇంచుమించుగా ఈ భాష్యాన్ని వారు నిర్మించారు. అందుచేత దీనికి తగిన అధికారులు చాలా కొద్దిమందే ఉంటారు. ఒక విధంగా అధికారాన్ని పొందినవారు కూడా దానిని వినియోగించుకొని కాలక్షేపాన్ని చేయడంకూడా మనకు కనిపించదు. "ఆవశ్యకమైనప్పుడు గ్రంథాన్ని అవలోకించడం" అనే క్రమంలోనే దీనిని పరిశీలించి చూచేవారు ఎవరో కొందరు ఉన్నారు తప్ప, శ్రీభాష్య గీతాభాష్యాదులను వలె,, దీనిని కూడా నియమంగా సేవించే అలవాటును కలవారు లేరనే నిర్వేదం మాకు చాలా కాలంగా ఉన్నది. దివ్యప్రబంధాలలో అవగాహనం అనేది లేకపోవటంతో పాటు, వాటిలో ద్వేషాన్ని కలవారు ఈ భాష్యమహాసాగరంలో అవగాహించకుండా ఉండడమే క్షేమం అని కూడా మేము భావించడం ఉన్నది.

ఈ విధంగా చెప్పదగిన గొప్పతనం ఈ భాష్యానికి ఉన్నదని విషయాన్ని ఇక్కడ కొంచెం నిరూపించాలని తలచి, సహస్రనామ స్తోత్రం నుండి కొన్ని తిరునామాలను ప్రస్తావించి, వానికి ఇతరులు చేసిన భాష్యాన్ని చూపించి, శ్రీభట్టర్ భాష్యంలో ఉండే స్వారస్యాతిశయాన్ని రసికులకు అందంగా వివరించి తెలుపుతాను.

"సద్గతిః సత్కృతిః సత్తా సద్భూతిః సత్పరాయణః" అనే చోట "సద్గతిః" అనే తిరునామానికి ఇతరులు చెప్పిన అర్థం ఏమంటే, "జగత్సృష్టి మొదలైన గొప్ప కార్యాలను చేసేవాడు" అనే అర్థాన్ని వారు చెప్పారు.ఈ అర్థాన్ని ఒక విషయంగా భట్టర్ భావించలేదు. ఎందుకంటే,, ఇంతకుముందు స్తోత్రంలో, "వసుప్రదో వాసుదేవో వసుర్వసుమనా హవిః" అని వాసుదేవనామ శ్రవణం ఉన్నందున ఈ ప్రకరణంలో ఉండే పలు నామాలు వసుదేవాత్మజుడైన శ్రీకృష్ణుని గుణ చేష్టితాలను తెలుపుతున్నాయి అని భావించి, " వసురేతాః" అనే తిరునామంనుండి ఆరంభించి, పలు నామాలను కృష్ణావతార కథాప్రతిపాదకాలుగానే భట్టర్ వ్యాఖ్యానించారు. స్పష్టంగానే ఈ విధంగా అవతారికను కూడా అనుగ్రహించారు. "సత్కృతిః" అనే ఈ నామం కూడా ఆ ప్రకరణంలోనే ఉన్నందువల్ల, దీనికి ఇతరులు చెప్పిన అర్థం విరసం అని భావించి, పాలును, పెరుగును వెన్నను దొంగతనం చేయడం, రోటికి బంధింపబడడం, గోపికలతో పాటు రాసక్రీడ ఆడడం మొదలైన గొప్ప గొప్ప లీలలను చేసేవాడు అని అందమైన అర్థాన్ని వివరించారు,భట్టర్. గోదాదేవి తిరుప్పావై ప్రబంధంలో "ఉన్ఱన్నై చ్చిఱు పేరழైత్తనవుమ్ శీఱియరుళాదే" (నిన్ను చిన్న పేరుతో పిలిచామని కోపగించుకోవద్దు) అని అన్నది. " శ్రీకృష్ణా! నీకు ఎన్నెన్నో పెద్ద పెద్ద నామాలు ఉండగా, వాటిని విడచిపెట్టి చిన్న పేరును పెట్టి నిన్ను పిలిచినందుకు నీవు కోపగించుకోవద్దు" అని ఇక్కడ క్షమాపణను వేడుతున్నది. ఇక్కడ చిన్న పేరుగా భావింపబడేది ఏది ?అని గమనించి చూచినప్పుడు, భట్టర్ శ్రీచరణాలలో

అర్థాన్ని విన్న మహాచార్యులు "నారాయణుడు, దేవాధిదేవుడు మొదలైన నామాలు చిన్న పేర్లు అని, గోవిందుడు గోపాలుడు మొదలైన నామాలు పెద్ద పెద్ద నామాలు" అని తెలియజేస్తున్నారు. భగవంతుడు మెచ్చే తిరునామం ఏదో, అదే గొప్పతనాన్ని కలిగినది అని, అతడు మెచ్చని పేరు ఏదో, అదే చిన్న పేరు అని చెప్పవలసి ఉన్నది.

పల్లెలో గోపాలురకు నాయకుడై వచ్చి జన్మించి, గోవులను లేగ దూడలను మేపిన అతిశయాన్ని పొందాలని భావించడంవల్ల, " కన్రు మెయ్ త్తు ఇనిదు ఉకంద కాళాయ్!" (లేగదూడలను మేపి ఆనందించిన వృషభంవంటివాడా!) అని సంబోధిస్తే అతని మనసు సంతోషిస్తుంది తప్ప, "నారాయణా! వైకుంఠవాసా!" అని అంటే సంతోషిస్తుందా? చాలా చాలా వెగటను కదా పొందుతుంది. గోవర్ధన పర్వతాన్ని గొడుగుగా పట్టుకొని ఉన్నప్పుడు, ఆ అతిమానుషలీలను చూచి చాలా సందేహపడినవారు "దేవో వా దానవో వా త్వమ్?"(నీవు దేవుడవా?) అని ప్రశ్నించగా, అప్పుడు చాలా కోపపడ్డాడు కదా, శ్రీకృష్ణుడు. "మీలో ఒకడనై గోపాలుడను అయినా, నన్ను దేవుడని నిందిస్తున్నారే, ఈ పాపిష్ఠివాళ్లు!" అని కదా ఆ స్వామి కోపించాడు. వీటికి అన్నిటికి తగినట్లుగా కదా అర్థాన్ని చెప్పాలి. "నారాయణనే నమక్కే పఱై తరువాన్" (నారాయణుడే మనకే వాద్యాన్ని ఇస్తాడు, అంటే, ప్రాప్యాన్ని ఇస్తాడు) అని, "నాற்ற త్తుழாయ్ ముడి నారాయణన్" (సువాసనను కలిగిన తులసీమాలికను కిరీటంలో కలిగిన నారాయణుడు) అని అంటూ చాలా అన్యాయంగా నిన్ను చిన్న పేర్లతో పిలిచానే! గోవిందుడు, గోపాలుడు అనే పెద్ద పెద్ద పేర్లను పెట్టి పిలువని మా దోషాన్ని నీవు సహించాలి– అని చెప్పినట్లుగా అర్థాన్ని గ్రహించడమే తగినది –అని భావించి మన పూర్వాచార్యులు ఈ విధంగా వ్యాఖ్యానించారు. ఈ స్వారస్యాన్ని తెలిసే భాగ్యం లేనివారు ఈనాటికీ

దీనికి విపరీతమైన అర్థాన్ని వ్రాసి, చెప్పి, వాదించడాన్ని చూస్తున్నాము. ఈ విషయం అటు ఉండనివ్వండి.

రసికులు "సత్కృతిః" అనే ప్రకృతతిరునామ భాష్యంలో ఏర్పడిన అందాన్ని గమనించాలి. జగత్సృష్టి మొదలైన వ్యాపారాలే భగవంతునకు గొప్పవి– అని అంటున్నారు, శంకరాచార్యులవారు. "అవి కాదు, గొప్పవి. " నెంజాల్ నినైప్పరిదాల్! వెణ్ణె యుూణెన్ను మీనచ్చొల్లే" (ఆహా !వెన్నను ఆరగించాడు– అనే చిన్న మాట కూడా మనసుతో భావించడానికి సాధ్యం కాని వైభవాన్ని కలిగినది) అని, " కానాయన్ కడిమనైయిల్ తయిరుండు నెయ్ పరుగ నందన్ పెற்ற వానాయన్" అని ఆళ్వార్లు అభినివేశాన్ని పొందే హీనకృత్యాలే గొప్పవి –అని అంటున్నారు,భట్టర్. " మత్తుఱు కడై వెణ్ణెయ్ కళవినిల్ ఉఱైవిడై యాప్పుండు ఎత్తిఱమ్! ఉరలినోడు ఇణైందిరుందు ఏంగియ వెళివే" (కవ్వంతో చిలుకుతూ ఉండగా, వెన్నను దొంగిలించినప్పుడు రోలుకు కట్టబడి వెక్కివెక్కి ఏడ్చిన భగవంతుని సౌలభ్యగుణప్రకారం ఎంత గొప్పదో కదా!) అని నమ్మాళ్వారులు ఆరు నెలల కాలం మోహించేటట్లు చేసిన లీలను విడచిపెట్టి, వేరొక లీలను "సత్కృతిః" అని చెప్పవచ్చునా?" అని భట్టర్ తమ మనసులో భావించారు.

ఇప్పుడు ఇంకొక తిరునామాన్ని చూద్దాం." విజితాత్మా విధేయత్మా సత్కీర్తిః ఛిన్నసంశయః, ఉదీర్ణః సర్వతః చక్షు రదీనః శాశ్వతః స్థిరః" అనే సందర్భంలో ఉండే అనేక నామాలకు ఇతరుల భాష్యంలో ఎటువంటి సారస్యం లేకపోవడం, భట్టర్ అనుగ్రహించిన భాష్యంలో అతిశయించిన స్వారస్యం ఉండడం ఇప్పుడు నిరూపింపబడుతున్నది.

"విజితాత్మా" అనే నామానికి "మనస్సును అణచినవాడు, నియంత్రించినవాడు, జితేంద్రియుడు "అనే అర్థాన్ని ఇతరులు గ్రహించారు. ఇందులో ఏమి స్వారస్యం ఉన్నది? తనను ఆశ్రయించినవారి విషయంలో తాను తక్కువవాడై నిలచి, విజయాన్ని వారికి కలిగించి, తాను అపజయాన్ని స్వీకరించేవాడు– అనే అర్థాన్ని భట్టర్ వివరిస్తున్నారు. " ఆడిచ్చియోమ్ తలమిశై నీ యణియాయ్, ఆழியమ్ కణ్ణా! ఉన్ కోలప్పాదమ్" (స్వామీ! దాసురాంద్రమైన మా తలలపై నీ పాదాన్ని ఆభరణంగా అలంకరించు) అనే భక్తులు ప్రార్థిస్తూ ఉండగా, " మమ శిరసి మండనం గోపికాదండనమ్" (గోపికలు చేసే దండనం నా శిరస్సుకు ఆభరణం) అని పలికిన భగవంతుని మనస్సుకు ప్రియమైన వ్యాఖ్యానం ఇదే కదా. " కూడారై వెల్లుమ్ శీర్ గోవిందా!" (నీతో కూడనివారిని జయించే కల్యాణ గుణాలను కలిగిన గోవిందా!) అనే గోదాదేవి పాశురానికి కల లోపల అర్థం లోపల ప్రవేశించి అవగాహించి, వ్యాఖ్యానం చేసే మన ఆచార్యులు " నిన్ను విరోధించేవారిని జయించడం, నీతో కలసేవారికి నీవు ఓడిపోవడం కదా నీ స్వభావం" అనే అర్థాన్ని వివరించారు. ఈ విధంగా వ్యాఖ్యానించడానికి మార్గదర్శకంగా ఉన్నది, ఇక్కడ భట్టర్ అనుగ్రహించిన భాష్యం.

ఇప్పుడు, తర్వాత నామాలను గమనిద్దాం. " విజితాత్మా విధేయాత్మా" అనే చోట అకార ప్రశ్లేష ఉన్నట్టుగా భావించి, "అవిధేయాత్మా"అని పదాన్ని విభజించి, దానికి తగిన అర్థాన్ని ఇతరులు గ్రహించారు. అంటే, ఎవరికీ విధేయం కాని స్వరూపాన్ని కలిగినవాడు –అనే అర్థాన్ని గ్రహించారు. కానీ, భట్టర్, " విధేయత్మా" అనే తిరునామంగా గ్రహించి, "నిలువడం కానీ, ఉండడం కానీ, పరుండడం కానీ, వెళ్లడం కానీ, రావడం కానీ, భుజించడం కానీ, అన్నిటిలోనూ భక్తుల ఆజ్ఞలకు బద్ధుడై ఉండే స్వరూపాన్ని కలవాడు"– అనే ఈ అందమైన అర్థాన్ని చెప్పారు. " కణి

క్కణ్ణన్ పోకిన్డాన్ కామరు పూమ్ కచ్చి మణివణ్ణా! నీ కిడక్క వేండా" (కాంచీ నగరంలో వేంచేసి ఉండే మణివర్ణా! కణి కణ్ణన్ వెళ్లిపోతున్నాడు. నీవు పరుండి ఉండకు, లేచి రా) అని భక్తి సారమునీంద్రులు అనగానే, భగవానుడు తాను శయనించి ఉండే ఆదిశేష శయనాన్ని మడచి, అక్కడనుండి బయలుదేరడం, ఆ విధంగానే, " పైన్నాగప్పాయ్ విరిత్తు క్కొళ్" (ఆదిశేషశయనాన్ని పరచుకో) అని అనగానే, ఆ విధంగానే మళ్లీ తిరిగి కాంచీనగరానికి వచ్చి ఆ శేషశయనాన్ని పరుచుకొని పరుండి ఉండడం– అనే వీటిని భక్తసారమునీంద్రులు మొదలైన భక్తుల విషయంలో చేసి, "శొన్న వణ్ణమ్ శెయ్ ద పెరుమాళ్ " అని, "యథోక్తకారి" అని పేరును పొందాడు. తన భక్తవిధేయతను జగద్విదితం చేసిన ఆ భగవంతుని మనస్సు సంతోషపడి, ఆనందించాలంటే, " విజితాత్మా" అనే నామానికి వేరే విధంగా వ్యాఖ్యానం చేసే అవకాశం ఉన్నదా? " జ్ఞానీ త్వాత్మైవ మే మతమ్" (జ్ఞాని అయితే నాకు ఆత్మయే అని నా అభిప్రాయం) అని గీతలో చెప్పిన భగవంతుని అభిప్రాయం ఏమి? జ్ఞానులకు నేను శరీరభూతుడను– అని సర్వశరీర అయిన భగవంతుడు స్వయంగా నోరు తెరిచి చెబుతున్నాడు. ఆత్మను గూర్చి అన్ని విధాలుగా విధేయంగా ఉండడమే కదా శరీర లక్షణం. జ్ఞానులకు భగవంతుడు విధేయుడు కాకపోతే, "జ్ఞానీ త్వాత్మైవ మే మతమ్" అని ఆ భగవంతుడు చెప్పినది, దానికి మన మహానుభావులైన పూర్వాచార్యులు అత్యంత స్పష్టంగా వ్యాఖ్యానించినది అంతా ఏమవుతుంది? తన విధేయత్వాన్ని నోరారా చెప్పడమే కాకుండా, ఆచరణలో కూడా భగవానుడు ప్రదర్శిస్తున్నాడు. " సేనయో రుభయో ర్మధ్యే రథం స్థాపయ మే ఽచ్యుత!" (శ్రీకృష్ణ రెండు సేనల మధ్య నా రథాన్ని నిలుపు) అని అర్జునుని ఆజ్ఞాపించడానికి, ఆ విధంగానే తాను చేయడానికి అనుకూలంగా కదా తనను

మలచుకున్నాడు. పార్థసారథి అనే పేరును వహించి ఉన్నాడు కదా. “నామ్ పార్ త్త శారదియన్ట్రో!” (మనం చూచిన సారథి కదా!)

ఇక, తరువాత, ఇంకొక నామాన్ని చూద్దాము.” ఛిన్న సంశయః “అనేది ఒక తిరునామం. “అన్నిటినీ చాలా స్పష్టంగా కరతలామలకంగా ఎల్లప్పుడూ చూస్తున్నాడు, కనుక, ఏ సందేహం లేనివాడు” –అనే అభిప్రాయంలో ఈ నామానికి ఇతరులు భాష్యాన్ని రచించారు. సందేహం, విపరీత జ్ఞానం, విస్మృతి మొదలైన దోషాలు ఏమీ లేని జ్ఞానానికి కదా గొప్పతనం ఉన్నది. అందువల్ల, భగవంతుడు అతిశయించిన జ్ఞానాన్ని కలవాడు– అని చెప్పినట్లయినది. అయితే, ఈ అర్థం సహస్రనామస్తోత్రంలో ఇంకా చాలా చోట్ల మరి కొన్ని నామాలలో కూడా వ్యక్తం అవుతున్నది. అందుచేత ఈ అర్థంలో ఏమీ విశేషం కానీ, స్వారస్యం గాని లేదు –అని భావించిన భట్టర్, చాలా అందంగా వ్యాఖ్యానించారు. ఈ నామానికి ముందు ఉన్న “సత్కీర్తిః” అనే నామానికి అనే ఇతరుల వలె సామాన్యంగా అర్థాన్ని చెప్పకుండా, “ సౌలభ్యం ఉన్నందు వల్లనే యదార్థమైన కీర్తిని కలిగిన వాడు అనే అర్థాన్ని ప్రకృత సందర్భానికి అనుగుణంగా చెప్పినందువల్ల, “చిన్న సంశయః” అనే ఈ నామానికి కూడా దానిని అనుసరించియే అందమైన అర్థాన్ని చెబుతున్నారు. అది ఏమని అంటే, భగవంతుని విషయంలో స్పష్టత లేనివారికి అనేక విధాలైన సందేహాలు కలుగుతాయట. భగవంతుడు తెలియదగినవాడా? తెలియదగనివాడా? సులభుడా? లేక,దుర్లభుడా? మనకు వశమై ఉండేవాడా? కాడా? అని ఈ విధంగా చాలా సందేహాలు కలుగుతాయట. వాటిని అన్నిటినీ తన ప్రవర్తనతో వెంటనే తీరుస్తాడు. “తాను దారిద్ర్యం లేనివాడు అనేదానికంటే, “ఇతరులను దారిద్ర్యంలేని వారినిగా చేస్తాడు” అనేది ఏ విధంగా గొప్పదో, ఆ విధంగానే, తాను సందేహం లేనివాడై ఉండడం కంటే కూడా, ఇతరులను సందేహం లేనివారినిగా చేసేవాడు– అనేది

గొప్పది అని మనం వివరించవలసిన ఆవశ్యకత ఉన్నదా! అందులోనూ, తన పరత్వాన్ని చూపించి సందేహాన్ని తీరుస్తున్నాడు –అనేదాని కంటే, తన సౌలభ్యాన్ని ప్రదర్శించి సందేహాన్ని నివృత్తిని చేస్తున్నాడు అనేది చాలా రసవత్తరం కదా.

ఈ ప్రకరణంలోనే, "అనీశః" తిరునామంలోని భాష్యాన్ని గమనించాలి. "తనకు మించిన ఈశ్వరుడు ఇంకొకడు లేనివాడు"– అని ఇతరులు వ్యాఖ్యానించారు. " తనకు తాను ఈశ్వరుడు కానివాడు, భక్త పరాధీనత చేత స్వాతంత్ర్యాన్ని కోల్పోయినవాడు కనుక, అనీశుడు– అని ఇక్కడ భట్టర్ భాష్యాన్ని అనుగ్రహించారు. "విల్లిపుదువై విట్టుశిత్తర్ తంగళ్ తేవరై వల్లపరిశు వరువిప్పర్" (శ్రీవిల్లి పుత్తూరులో వేంచేసి ఉండే విష్ణుచిత్తులు తమ స్వామి అయిన భగవంతుని తగిన ఉపాయంతో, మమ్ములను అతడు అనుగ్రహించేటట్లు చేస్తారు,) అని గోదాదేవి పలికిన విధంగా భక్తులు వేడినీళ్ళను కాచి, "నారణా! నీరాడ వారాయ్!" (నారాయణా! స్నానం చేయడానికి రా!), "ఇన్ఱు నీ నీరాడవేండుమ్ ఎంబిరాన్! ఓడాదే వారాయ్" (స్వామీ! ఈనాడు నీవు స్నానం చేయాలి. పారిపోకుండా, రా) అని పిలిస్తే, స్నానం చేయడం కోసం పరిగెత్తుకొని వచ్చేవాడు,. కొన్ని పూలను కోసి, చేతిలో పెట్టుకొని, "శెణ్బగ ప్పూచ్చూట్ట వారాయ్!" (సంపెంగ పువ్వులను అలంకరిస్తాను, రా) అని పిలిస్తే పూలను అలంకరించుకోవడం కోసం పరిగెత్తుకుని వచ్చేవాడైన భగవంతుని ఏ భాష్యం ఆనందింప చేస్తుంది? అని రసికులే విమర్శించగలరు.

ఇప్పుడు, ఇంకొక సందర్భాన్ని గమనిద్దాం. "వసుః వసుమనాః సత్యః సమాత్మా సమ్మితః సమః" అనే చోట ఉండే "సమాత్మా" అనే నామాన్ని "అసమ్మితః" అనే తిరునామంగా గ్రహించి, "అపరిచ్ఛిన్నుడు" –అనే అర్థాన్ని ఇతరులు గ్రహించారు. వెలను ఇచ్చి, పనిని కొనుక్కున్నట్లుగా, భగవంతునకు సహజంగా లేని

ఒక ఆకారాన్ని ఆరోపించి, ఎందుకు ఈ విరసమైన అర్థాన్ని చెప్పడం? అనే మనసులో బాధపడిన భట్టర్, "సమ్మితః" అనే రూపాన్ని గ్రహించి, "అన్ని విధాలుగాను భక్తులకు పరిచ్ఛిన్నం అయేవాడు" – అనే అర్థాన్ని అనుగ్రహించారు. "అழுకైయుమ్ అంజునోక్కుమ్ అన్నోక్కుమ్ అణికొళ్ శెంజిఱువాయ్ నెళిప్పదువుమ్, తొழுకైయుమ్ ఇవై కండ అశోదై తొల్లైయిన్బత్తు ఇఱుది కండాళే" (బాలకృష్ణుడు వెన్న పాలు పెరుగులను దొంగతనం చేయగా, యశోద అతనిని రోటికి కట్టినప్పుడు, ఆ బాలకృష్ణుడు చేసిన ఏడవడం, భయపడుతూ, అటు ఇటు దిక్కులను చూడడం అందమైన ఎర్రని అతని పెదవులు భయంతో కంపించడం చివరకు చేతులను జోడించి నమస్కరించడం – అనే ఈ లీలలను అన్నిటినీ దర్శించిన యశోద భగవంతుని పరమావధిని చూచింది) అని శ్రీకులశేఖరులు పలికిన దివ్యప్రబంధంలోని పాశురంలో "తొల్లై యిన్బత్తు ఇఱుది కండాళే" అనే ప్రయోగాన్ని– భగవంతుని (వేదాలు అపరిచ్ఛిన్నుడు అని చెప్పడానికి విరుద్ధంగా) పరిచ్ఛిన్నునిగా దర్శించినది– అని పూర్వాచార్యులు వ్యాఖ్యానించడానికి ఆకరం ఈ భట్టర్ సూక్తియే.

"నియంతా నియమో యమః" అనే చోట, "ఆధార నిలయో ధాతా" అనే చోట "అనియమః, నియమః ", "అయమః, యమః", " అధాతా, ధాతా" అని రెండు విధాలుగాను పదచ్ఛేదం చేసి ఇతరులు వ్యాఖ్యానించారు. " విజితాత్మా, విధేయత్మా" అనే చోట కూడా ఆ విధంగానే రెండు విధాలుగాను పదవిభాగాన్ని చేసి, రెండు రీతులలో అర్థాన్ని చెప్పే అవకాశం ఉన్నప్పటికీ, వారు ఆ విధంగా ఎందుకు చేయలేదు? అని విమర్శించి చూసినప్పుడు, భగవద్గుణాలలో లోతుగా అవగాహించడానికి అనుగుణమైన దివ్యప్రబంధామృతసాగరావగాహనం భట్టర్ కు

ఉన్నట్లుగా, ఇతర సంప్రదాయాలకు చెందిన ఆచార్యులకు లేకపోవడమే– అనే విషయాన్ని సులభంగా నిశ్చయించి చెప్పవచ్చు.

పరత్వం, సౌలభ్యం అనే రెండు విధాలైన రీతులకు చెందిన గొప్పతనాలు భగవంతునిలో ఉన్నాయి. ఈ రెండిటిని అనుభవించడానికి మనం పెట్టి పుట్టాము. అయినప్పటికీ, అనుభవంలో మన మనస్సును మిక్కిలిగా ద్రవీకరింప చేసేవి సౌలభ్యప్రకారానికి సంబంధించిన గుణాలే తప్ప, పరత్వ ప్రకారానికి సంబంధించిన గుణాలు కావు. నమ్మాళ్వార్లు "ఉయర్వఱ ఉయర్ నలముడైయవన్" (నిస్సమాభ్యధికమైన ఆనందగుణాన్ని కలిగినవాడు) అని తమ తిరువాయ్ మొழி దివ్యప్రబంధం ప్రారంభంలో పరత్వగుణాన్ని అనుభవించినప్పుడు ఏ కొంచెం కూడా వికారాన్ని పొందకుండా పలుకగలిగారు. ఆ ఆళ్వార్లే "ఎత్తిఱమ్! ఉరలినోడు ఇణైందిరుందు ఏంగియ వెళివే" (రోటికి కట్టబడినప్పుడు శ్రీకృష్ణుడు వెక్కి వెక్కి ఏడ్చిన సౌలభ్యప్రకారం ఆహా! ఎంత గొప్పది!) అని, "పిఱందవాఱుమ్ వళర్ న్ద వాఱుమ్" (శ్రీకృష్ణుడు అవతరించిన రీతి, పెరిగిన రీతి ఎంత గొప్పది!) అని అంటూ ఆరు నెలల కాలం మోహాన్ని పొందారు– అనే వృత్తాంతం ప్రసిద్ధం. ఈ విషయాన్నే కూరేశులు అతిమానుషస్తవంలో "తాదృఙ్న తే చరిత మార్యజనా స్సహంతే" (నీ అటువంటి చరిత్రను విని ఆర్యజనులైన ఆళ్వారులు మనసులో తట్టుకోలేకుండా ఉన్నారు) అని, "ఆర్ద్రీకరోతి విదుషాం హృదయం తదేతత్" (ఈ నవనీతచౌర్యాది వృత్తాంతాలు జ్ఞానులైన అళ్వారుల హృదయాలను ద్రవీకరింప చేస్తున్నవి) అనుగ్రహించారు. అందుచేత భగవంతుని సౌలభ్య గుణాలనే ఎక్కువగా వివరించడంలోనే మన పూర్వాచార్యులు కుతూహలాన్ని కలిగి ఉన్నారు. ఎందుకంటే, ఇదే దివ్యసూరులు చూపిన దారి –కనుక.

ఇందువల్ల పరత్వానికి సూచకాలైన కల్యాణ గుణాలలో వీరు పగను,అసహనాన్ని కలిగి ఉన్నారు– అని అర్థం కాదు. ఆ గుణాలను కూడా వీరు అపరిమితంగా అనుగ్రహిస్తూనే ఉంటారు. అయితే, సౌలభ్య గుణాలను అనుభవించే

సందర్భం ఏదైనా కొంచెం ఏర్పడితే, ఆ సందర్భాన్ని ఉపేక్షించకుండా, చక్కగా ఆదరించి పలుకుతారు.

మనస్సును ద్రవీకరింప చేసే అర్థవిశేషాలను అనుగ్రహించడంలో భగవద్రామానుజుల వారి కంటేకూడా శ్రీపరాశరభట్టర్ చాలా సమర్థులు అనేది భగవద్విషయ దివ్యగ్రంథ రసికులకు సుపరిచితమైన విషయం. మహామేధావి అయిన వీరి బుద్ధికి అనాయాసగా గోచరించే అర్థం మిగిలినవారి బుద్ధికి ఎంత శ్రమపడినా గ్రహించడానికి సాధ్యం కాదు— అని అంటే, ఇది అతిశయోక్తి కానే కాదు. కొన్ని సందర్భాలను పురస్కరించుకొని దీనిని సూచిస్తాను.

ఈ సహస్రనామంలో "అర్థో ఽ నర్థో మహాకోశః" అనే చోట "అనర్థః" అని తిరునామాన్ని వ్యాఖ్యానించే ఇతరులు "తాను కోరవనలసిన వస్తువు ఏదీ లేనివాడు" —అనే అర్థాన్ని గ్రహించారు ఇది మనవంటివారికి కూడా సులభంగా గోచరించే అర్థమే. కానీ, భట్టర్ ఇక్కడ ఈ నామానికి గ్రహించిన అర్థం ఏమంటే, "అల్పమైన ప్రయోజనాలను ఆశించే భాగ్యహీనులచేత కోరబడనివాడు" అని అన్నారు. దీనికి తరువాత ఉండే "మహాకోశః" అనే తిరునామానికి "అన్నమయ ప్రాణమయ మనోమయాదులైన ఐదు మహాకోశాలలో ఉండేవాడు" అనే అర్థాన్ని ఇతరులు చెప్పారు. అర్థులైన భక్తులకు అంతు లేకుండా ఇచ్చినప్పటికీ కూడా, ఏ విధంగానూ తగ్గని నవనిధులను, రత్నాకరాలను తన బొక్కసంలో కలిగినవాడు— అని భట్టర్ అనుగ్రహించిన అర్థం. ఈ విధంగా మనం ప్రస్తావించి చెప్పదగిన, అద్భుతమైన అర్థాలు అంతు లేకుండా ఈ మహాచార్యుల సహస్రనామ స్తోత్రభాష్యంలో ప్రకాశిస్తున్నాయి.

★★★★★